# అధికార భాష తీరు తెన్నులు

కూర్పు, రచన

**సి. ధర్మారావు**
అధికార భాషా సంఘం కార్యదర్శి

ప్రచురణ
ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం
సచివాలయం, హైదరాబాద్

## విషయ సూచిక

# మున్నుడి

—నండూరి రామకృష్ణమాచార్య.
అధ్యక్షుడు
అధికార భాషా సంఘం

ప్రజల భాషలో పరిపాలన కొనసాగకపోతే ప్రజాస్వామికం నిరర్థకం.

ఆంధ్రప్రదేశ్‌లో ప్రజల భాష తెలుగు. నూటికి 88 మందికి మాతృభాష తెలుగు. సుమారు 8 మంది ఉర్దూ మాట్లాడే వారున్నారు. మిగిలిన 4 శాతం మంది ఒరియా, మరాఠీ, కన్నడం, తమిళం మొదలైన భాషలు మాతృభాషగా గలవారున్నారు. అయితే వీరిలో కూడా చాలా మంది తెలుగు తెలిసినవారున్నారు. ఈ విధంగా ఆంధ్రప్రదేశ్‌లో నూటికి సుమారు 98 మంది తెలుగు తెలిసినవారే.

మనది ప్రజాస్వామిక ప్రభుత్వం. ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు మాట్లాడే భాష తెలుగు. కాబట్టి ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు అధికార భాష కావడం అవశ్యచారిత్రిక సన్నివేశం. ఇది వివాదగ్రస్తమైన విషయం కాదు.

అయితే – ఆరు కోట్ల మంది ఆంధ్ర పౌరజీవిత స అవశ్యవాంఛనీయమైన మార్పు – పరిపాలన భాషగా తెలుగు – ఒక అర్థరాత్రి ఆకస్మికంగా రాదు కదా. ఈ ఉద్యమంలో తెరమరుగున కృషి చేసినవారు ఎందరో మహానుభావులు – అందరికీ వందనములు. ఈ కృషికి అద్దం పట్టిన సమీక్షా వ్యాసం వ్రాసిన వారు – శ్రీ సి. ధర్మారావుగారు ప్రస్తుతం అధికార భాషా సంఘం కార్యదర్శి. ఈ సమస్యతో

1983 జనవరిలో ముఖ్యమంత్రిగా శ్రీ రామారావు పదవీ స్వీకారం చేశాక స్వయంగా వారి సమక్షంలో ఇటువంటి సమీక్షా సమావేశం మొదటిసారి జరిగింది 1983 అక్టోబరు 29వ తేదీన. తర్వాత రెండో సమీక్షా సమావేశం తిరిగి 1985 మే లో జరిగింది. 1986 సెప్టెంబరులో జరుగవలసిన 3వ సమీక్షా సమావేశం కారణాంతరాలవల్ల వాయిదా పడి సుమారు 3 సంవత్సరాల తదనంతరం ఆరోజు జరుగ నున్నది.

శ్రీ రామకృష్ణమాచార్య తమ నాలుగు నెలల పదవీ కాలంలో అప్పటికే వారు సుమారు 10 జిల్లాలలో విస్తృత పర్యటన పూర్తి చేసి కార్యాలయాలలో తెలుగు అమలును గూర్చిన ప్రబోధాన్ని దాదాపు ఒక ఉద్యమంగా రూపొందిస్తున్నారు. హైదరాబాదు నగర కార్యాలయాలలో వున్న ఇంగ్లీషు టైపిస్టులకు, తెలుగు టైపురైటింగులో శిక్షణకు ఉద్దేశించిన విస్తృత పథకం 1600 మంది ఉద్యోగులకు శిక్షణ పూర్తి చేసి చరమ దశకు వస్తున్నది. క్రొత్తగా సర్వీసులో చేరనున్న టైపిస్టులకు జూనియర్ స్టెనోలకు కావలసిన సాంకేతిక అర్హతలను ప్రభుత్వం మార్చి వేస్తూ ఉత్తర్వులు ఇచ్చింది. దీని ప్రకారం తెలుగు టైపురైటింగు, తెలుగు షార్టుహాండు ఆవశ్యక అర్హతలుగా ప్రభుత్వం ప్రకటించింది. ఈ నేపథ్యంలో ఉర్దూ భాషకు అన్యాయం జరుగుతుందేమో, పాలనా యంత్రాంగంలో ఉర్దూ ఉద్యోగులు నష్టపోతారేమో అన్న ఆందోళన ఉర్దూ భాషీయుల్లో చోటు చేసుకుంటున్నది.

1,987 చివర్లో, 1988 ఆరంభంలో సచివాలయంలోని అన్ని శాఖల సిబ్బందికి, అధికారులకు 35 రోజుల పాటు అధికార భాషా సంఘం అధ్యక్షులూ, కార్యదర్శి తెలుగు అమలు విషయంలో గోష్ఠులు నిర్వహించి 3,500 మంది ఉద్యోగులను ప్రత్యక్షంగా కలిశారు ఆపైన అధికార భాష ఉపమంత్రి శ్రీ దాడి వీరభద్రరావు గారితో కలిసి అధ్యక్షులు ప్రధాన కార్యదర్శి ఆధ్వర్యంలో ప్రభుత్వ కార్యదర్శులందరితో ఒక సమావేశం జరిపారు.

ఫిబ్రవరి 6వ తేదీనాడు అధికార భాషా సంఘం సమావేశమై ఒక ప్రధానమైన తీర్మానాన్ని ఆమోదించి ఉన్నది. పరిపాలనలో తెలుగు వాడ కానికి ప్రభుత్వం తీసుకున్న ఎన్నో ముఖ్యమైన నిర్ణయాల ప్రభావం రాష్ట్ర కార్యాలయాలపైన చాలావరకు ఉన్నప్పటికి, గమ్యం పూర్తిగా చేరుకోవడానికి ఉన్నత పాలనా యంత్రాంగానికి మరికొంత అదిలింపు అవసరమని, గౌ. ముఖ్యమంత్రిగారి సమక్షంలో ఒక సమీక్షా సమా వేశాన్ని ఏర్పాటు చేయడం అమితమైన ప్రయోజనం చేకూర్చగలదని ఆ తీర్మాన సారాంశం. ఈ పరిస్థితులలో ప్రస్తుత సమావేశంలో ఏయే అంశాలు చర్చకు రానున్నది, అల్ప వ్యవధిలోనే సమావేశం ఏర్పాటు చేసిన ముఖ్యమంత్రి గారు ఏ అంశానికి ప్రాధాన్యత ఇవ్వనున్నారు, వారి అంతర్యం ఏమిటన్నది హాజరైన ప్రముఖులలో ఎవరికీ స్పష్టమైన అవగాహనలేదనే చెప్పాలి. ప్రభుత్వం తక్షణం చేపట్ట వలసిన అంశాల పైన ముఖ్యమంత్రికి నివేదించటానికి 8 అభ్యర్థనలను సిద్ధంచేసు కున్నారు శ్రీ ఆచార్య. వారికి వత్తాసు పలకటానికి వేరే వూళ్ళనుండి హడా వుడిగా ప్రయాణమై వచ్చారు వారి సభ్యులు. అయితే సమీక్షను ప్రధాన కార్యదర్శి ప్రారంభిస్తారా, సంఘం అధ్యక్షులను ప్రారంభించమంటారా, ముఖ్యమంత్రి తామే తమ ప్రసంగంతో ఆరంభిస్తారా తెలియదు.

అందుచేత హాజరయిన వారిలో సహజంగా ఉత్కంఠ చోటు చేసు కుంది.

ఆ ఉదయం 11 గంటల వేళ సచివాలయంలోని తమ మందిరంలో మంద్ర గంభీర స్వరంలో ఆందోళనను మిళితం చేసి ముఖ్యమంత్రి శ్రీ రామారావు తమ ప్రసంగాన్ని ఒక్క ఉదుటున ప్రారంభించారు. తమ పరిపాలన ప్రారంభమై 5 సంవత్సరాలు పూర్తి అయినా తెలుగు ఒక్క అడుగు కూడా ముందుకు వెళ్ళలేదని అన్నారు. సచివాలయం అంతా ఇంగ్లీషుమయంగా కనిపిస్తున్నదని, తమకు ఒక్క ఫైలు కూడా తెలుగులో రావడం లేదని అంటూ, ఈ అశేష ఆంధ్ర ప్రజకు కనీసం తమ

వీరికి గల ప్రత్యక్ష పరిచయం ఈ రచనకు జీవనాడి ప్రసాదించింది. తెలుగు అమలుకు జరిగిన కృషి ఈ రచన వివరిస్తుంది. తెలుగు అమలు ఒక ప్రజాస్వామిక వాఙ్మయ యజ్ఞం. ఇది ప్రజాస్వామిక ప్రభుత్వం నిర్వహించవలసిన పవిత్ర కర్తవ్యం. ఈ కర్తవ్య నిర్వహణకు దోహదం సమకూర్చిన చారిత్రిక వ్యక్తి, ఈ ప్రగతి సాధనకు ముఖ్యకారకులు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి మాన్యశ్రీ నందమూరి తారక రామారావుగారు-

ఆంధ్రజాతి కెవడు-ఆత్మగౌరవముద్ర
అనవాలు తెచ్చినట్టి ఘనుడు ।
మేటి నాయకుండు-మేధావి-తేజస్వి
రామరావు తెలుగు సీమలోన.

తెలుగు జగన్నాథ రథం కదిలింది. అయితే ఇంతవరకు జరిగిన కృషి కంటే ఇకమీద జరుగవలసిన కృషి ఎక్కువగా మిగిలి ఉంది. కోర్టులలో తెలుగు అమలు జరగాలి. చట్టాలు – సంహితలు, స్మృతులు అన్నీ ఆంగ్లం నుండి తెలుగులోకి రావాలి. అద్యతన భవిష్యత్తులో అనువాద గంగావతరణం జరగాలి.

ఈ వాఙ్మయ మహా యజ్ఞంలో -- రాష్ట్రంలోని విశ్వకళా పరిషత్తులు – అకాడమీలు – పత్రికలు – మేధావులు పాల్గొని ఈ కృషిని జయప్రదం చేయగలరని నా నమ్మకం.

హైదరాబాదు,
తేది 25-3-1989.

# అధికార భాష తీరు తెన్నులు

## చిరస్మరణీయమైన 1988వ సంవత్సరం

మన రాష్ట్రంలో ప్రభుత్వ పరిపాలనా వ్యవహారాలన్ని తెలుగులోనే నడిపించాలని గత రెండు దశాబ్దాలకు పైగా ప్రభుత్వం చేస్తున్న కృషిలో 1988వ సంవత్సరం ఒక విశిష్ట స్థానాన్ని సంతరించుకున్నది. 1966వ సంవత్సరం మే 14 నుంచి అమలులోకి వచ్చిన ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం తెలుగు భాషకు రాష్ట్ర అధికార భాషగా శాసన ప్రతిపత్తి కల్పించింది. అప్పటి నుంచి రాష్ట్ర పాలనా యంత్రాంగపు వివిధ స్థాయిలలో వివిధ వ్యవహార కలాపాలకు తెలుగును ప్రవేశ పెట్టి అమలు చేయాలన్న కృషికి ఈ సంవత్సరంలో అనూహ్యమైన ఒక క్రొత్త ఊపు వచ్చింది. ఈ స్ఫూర్తిని కలుగజేసి 1988వ సంవత్సరాన్ని చిరస్మరణీయంగా చేసిన కీర్తి ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారక రామారావు గారికి చెందుతుంది.

ఆ రోజు మార్చి 14, సోమవారం సచివాలయంలో ముఖ్యమంత్రిగారి సమక్షంలో అధికార భాషా సమీక్షా సమావేశం జరుగనున్నది. ఆ సమావేశానికి అప్పటి ప్రధాన కార్యదర్శి శ్రీ శ్రావణ్ కుమార్, ముఖ్యమంత్రి గారి కార్యదర్శి కే.శే. రాఘవేంద్రరావు, ఉపకార్యదర్శి శ్రీ చక్రపాణి, ప్రధాన పరిపాలనశాఖ కార్యదర్శి శ్రీ వళ్లియప్పన్, న్యాయ శాఖ కార్యదర్శులు శ్రీ విద్యాసాగర్, శ్రీ నారాయణరావు ప్రభృతులు హాజరయ్యారు. మరోవైపున అధికార భాషా సంఘం అధ్యక్షులుగా అప్పటికి నాలుగు మాసాల క్రింతం పదవీ స్వీకారం చేసిన డా. నండూరి రామకృష్ణమాచార్య, వారి సంఘం సభ్యులు శ్రీ మధురాంతకం రాజారాం, డా. కొలకలూరి ఇనాక్, శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు, డా. మల్లెమాల వేణుగోపాలరెడ్డి, సంఘం కార్యదర్శి ధర్మారావు సమావేశానికి హాజరు అయ్యారు

1983 జనవరిలో ముఖ్యమంత్రిగా శ్రీ రామారావు పదవీ స్వీకారం చేశాక స్వయంగా వారి సమక్షంలో ఇటువంటి సమీక్షా సమావేశం మొదటిసారి జరిగింది 1983 అక్టోబరు 29వ తేదీన. తర్వాత రెండో సమీక్షా సమావేశం తిరిగి 1985 మే లో జరిగింది. 1986 సెప్టెంబరులో జరుగవలసిన 3వ సమీక్షా సమావేశం కారణాంతరాలవల్ల వాయిదా పడి సుమారు 3 సంవత్సరాల తదనంతరం ఆరోజు జరుగనున్నది.

శ్రీ రామకృష్ణమాచార్య తమ నాలుగు నెలల పదవీ కాలంలో అప్పటికే వారు సుమారు 10 జిల్లాలలో విస్తృత పర్యటన పూర్తి చేసి కార్యాలయాలలో తెలుగు అమలును గూర్చిన ప్రబోధాన్ని దాదాపు ఒక ఉద్యమంగా రూపొందిస్తున్నారు. హైదరాబాదు నగర కార్యాలయాలలో వున్న ఇంగ్లీషు టైపిస్టులకు, తెలుగు టైపురైటింగులో శిక్షణకు ఉద్దేశించిన విస్తృత పథకం 1600 మంది ఉద్యోగులకు శిక్షణ పూర్తి చేసి చరమ దశకు వస్తున్నది. క్రొత్తగా సర్వీసులో చేరనున్న టైపిస్టులకు జూనియర్ స్టెనోలకు కావలసిన సాంకేతిక అర్హతలను ప్రభుత్వం మార్చి వేస్తూ ఉత్తర్వులు ఇచ్చింది. దీని ప్రకారం తెలుగు టైపురైటింగు, తెలుగు షార్టుహాండు ఆవశ్యక అర్హతలుగా ప్రభుత్వం ప్రకటించింది. ఈ నేపథ్యంలో ఉర్దూ భాషకు అన్యాయం జరుగుతుందేమో, పాలనా యంత్రాంగంలో ఉర్దూ ఉద్యోగులు నష్టపోతారేమో అన్న ఆందోళన ఉర్దూ భాషీయుల్లో చోటు చేసుకుంటున్నది.

1987 చివర్లో, 1988 ఆరంభంలో సచివాలయంలోని అన్ని శాఖల సిబ్బందికి, అధికారులకు 35 రోజుల పాటు అధికార భాషా సంఘం అధ్యక్షులూ, కార్యదర్శి తెలుగు అమలు విషయంలో గోష్ఠులు నిర్వహించి 3,500 మంది ఉద్యోగులను ప్రత్యక్షంగా కలిశారు అప్పైన అధికార భాష ఉపమంత్రి శ్రీ దాడి వీరభద్రరావు గారితో కలిసి అధ్యక్షులు ప్రధాన కార్యదర్శి ఆధ్వర్యంలో ప్రభుత్వ కార్యదర్శులందరితో ఒక సమావేశం జరిపారు.

ఫిబ్రవరి 6వ తేదీనాడు అధికార భాషా సంఘం సమావేశమై ఒక ప్రధానమైన తీర్మానాన్ని ఆమోదించి ఉన్నది. పరిపాలనలో తెలుగు వాడకానికి ప్రభుత్వం తీసుకున్న ఎన్నో ముఖ్యమైన నిర్ణయాల ప్రభావం రాష్ట్ర కార్యాలయాలపైన చాలావరకు ఉన్నప్పటికీ, గమ్యం పూర్తిగా చేరుకోవడానికి ఉన్నత పాలనా యంత్రాంగానికి మరికొంత అదిలింపు అవసరమని, గౌ. ముఖ్యమంత్రిగారి సమక్షంలో ఒక సమీక్షా సమావేశాన్ని ఏర్పాటు చేయడం అమితమైన ప్రయోజనం చేకూర్చగలదని ఆ తీర్మాన సారాంశం. ఈ పరిస్థితుల్లో ప్రస్తుత సమావేశంలో ఏయే అంశాలు చర్చకు రానున్నది, అల్ప వ్యవధిలోనే సమావేశం ఏర్పాటు చేసిన ముఖ్యమంత్రి గారు ఏ అంశానికి ప్రాధాన్యత ఇవ్వనున్నారు, వారి అంతర్యం ఏమిటన్నది హాజరైన ప్రముఖుల్లో ఎవరికీ స్పష్టమైన అవగాహనలేదనే చెప్పాలి. ప్రభుత్వం తక్షణం చేపట్ట వలసిన అంశాల పైన ముఖ్యమంత్రికి నివేదించటానికి 8 అభ్యర్థనలను సిద్ధంచేసుకున్నారు శ్రీ ఆచార్య. వారికి వత్తాసు పలకటానికి వేరే ఊళ్లనుండి హడావుడిగా ప్రయాణమై వచ్చారు వారి సభ్యులు. అయితే సమీక్షను ప్రధాన కార్యదర్శి ప్రారంభిస్తారా, సంఘం అధ్యక్షులను ప్రారంభించమంటారా, ముఖ్యమంత్రి తామే తమ ప్రసంగంతో ఆరంభిస్తారా తెలియదు.

అందుచేత హాజరయిన వారిలో సహజంగా ఉత్కంఠ చోటు చేసుకుంది.

ఆ ఉదయం 11 గంటల వేళ సచివాలయంలోని తమ మందిరంలో మంద్ర గంభీర స్వరంలో ఆందోళనను మిళితం చేసి ముఖ్యమంత్రి శ్రీ రామారావు తమ ప్రసంగాన్ని ఒక్క ఉదుటున ప్రారంభించారు. తమ పరిపాలన ప్రారంభమై 5 సంవత్సరాలు పూర్తి అయినా తెలుగు ఒక్క అడుగు కూడా ముందుకు వెళ్ళలేదని అన్నారు సచివాలయం అంతా ఇంగ్లీషుమయంగా కనిపిస్తున్నదని, తమకు ఒక్క ఫైలు కూడా తెలుగులో రావడం లేదని అంటూ, ఈ అశేష ఆంధ్ర ప్రజకు కనీసం తమ

పరిపాలనను తెలుగులో అందించలేకపోతున్నామన్న బాధ తమను వెంటాడు తున్నదని అన్నారు. మళ్ళీ ప్రజల వద్దకు తాము ఏ మొహం పెట్టుకుని వెళ్ళగలమనేది అర్థం కావడం లేదన్నారు

అనుకోని రీతిలో వచ్చిన ఈ హటాత్ పరిణామానికి సభ్యులందరూ ఆశ్చర్యచకితులయ్యారు.

జిల్లా యంత్రాంగం స్థాయిలో చాలా కాలంగా తెలుగు కొంతలో కొంత అమలు ఔతున్నదని, ప్రభుత్వం అనేక ఆదేశాలు జారీచేసిందని, జిల్లా కార్యాలయాలలో 100కి 100 పాళ్ళు తెలుగు అమలు చేసే విషయమై మరింత శ్రద్ధ వహించి కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేయ గలమని ఉన్నతాధికార్లు సర్ది చెప్పారు. అధికార భాషా సంఘం అధ్యక్షులు, సభ్యులు కూడా తమ జిల్లా పర్యటనల్లో గమనించిన అంశాలు కొన్ని చెప్పారు. ఐతే అవేవీ ముఖ్యమంత్రి గారిని సంతృప్తి పరచలేదు. జిల్లా యంత్రాంగం మాట అటుంచి సచివాలయం సంగతి ఏమిటని నిగ్గదీశారు. తాము ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారం చేసిన 1983వ సంవత్సరంలోనే సచివాలయంలో కూడా తెలుగును ప్రవేశపెడుతూ ఉత్తర్వులు ఇచ్చాము కదా అని గుర్తు చేసుకున్నారు. సచివాలయానికి కూడా ఒకసారి ఉత్తర్వులు యిచ్చాక, మళ్ళీ తిరోగమనం కూడదని అధ్యక్షులు అన్నమాటను ముఖ్యమంత్రి బలపరిచారు. ఈ ఉత్తర్వులు అమలు పరచడంలో ఎవరూ ఏమీ పట్టించుకోలేదనే బాధను వ్యక్తం చేశారు. ఆత్మవిమర్శ ధోరణిలో–దీనిలో తమ బాధ్యత కూడా కొంత ఉన్నదని, తమ చాపల్యాలు తమకు ఉన్నాయని ఆత్మవిమర్శ చేసుకున్నారు. తాము వెచ్చించవలసినంత సమయాన్ని దీనికొరకు వెచ్చించలేదన్నారు. మొత్తానికి ఏమైతేనేమి వెంటనే అందరూ కార్యోన్ముఖులు కావాలని ఉద్బో ధించారు. ఇక ఒక్క క్షణం కూడా తాము వేచి ఉండే స్థితిలో లేమని, వచ్చే నెల ఆరంభంనాటికి అంటే ఏప్రిల్ 1 నాటికి సచివాలయంలో ఇంగ్లీషులో ఫైలు కనపడకూడదని, తాము ఒక్క ఇంగ్లీషు ఫైలును

కూడా చూడదలచుకోలేదని నిష్కర్షగా చెప్పారు. వారు చెప్పవలసినది పూర్తి అయిందని అనిపించిన తరువాత, సంఘం అధ్యక్షులు తమ 8 అభ్యర్థనలను చదివి వినిపించి అభ్యర్థన పత్రాలను ముఖ్యమంత్రికి సమర్పించారు. ఆ అభ్యర్థనల్లో మకుటాయమానమైనది, మరో నాలుగు రోజులలో రానున్న తెలుగు క్రొత్త సంవత్సరం "విభవ"ను అధికార భాషా సంవత్సరంగా ప్రభుత్వం ప్రకటించాలి అన్నది. ఈ అభ్యర్థనలను ముఖ్యమంత్రి మౌనంగా, సావధానంగా విని, సమావేశం ముగింపు సూచించారు. వారి మౌనం సంపూర్ణ అంగీకారంగా సభ్యులు భావించారు.

అంతే! రాష్ట్ర అధికార భాషావికాస పరిణామ చరిత్రలో ఒక నూతన ఘట్టం ప్రారంభమైంది. సమావేశ ఫలితాలకు, అక్కడ జరిగిన నిర్ణయాలకు అమితంగా సంతోషపడింది అధికార భాషా సంఘం అధ్యక్షులూ, వారి బృందం అని వేరే చెప్పనక్కరలేదు.

ప్రధాన కార్యదర్శి వెంటనే కార్యరంగంలోకి దిగారు. ఏప్రిల్ రెండు నుంచి సచివాలయంలో ఫైళ్ళన్నీ పూర్తిగా తెలుగులోనే నిర్వహించాలనీ, తెలుగులో అంతగా ప్రవేశంలేని ఉన్నతాధికారులు కూడా ఫైళ్ళను ఇంగ్లీషులో ఆశించకుండా ప్రత్యేకమైన ఏర్పాట్లు చేసుకొని ఫైళ్ళను సమగ్రంగా తెలుగులోనే నిర్వహిస్తూ, ఉండవలసిందని సచివాలయంలోని కార్యదర్శులందరికి ఆదేశాలు జారీ చేశారు. ఇవి కాక మార్చి 19వ తేదీన రాష్ట్ర కార్యాలయాలన్నింటికి ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. ఈ ఆదేశాల్లో ప్రథమ అంశంగా "విభవ" తెలుగుసంవత్సరాన్ని ప్రభుత్వం అధికార భాషా సంవత్సరంగా పరిగణిస్తున్న విషయం ప్రకటించారు. ఈ ఉత్తర్వుల్లో బహుశా ఏ ఇతర రాష్ట్ర ప్రభుత్వం తలపెట్టి ఉండని ఒక ఆసక్తికరమైన అంశం కూడా వున్నది. తనకి ఇంగ్లీషులో చేరిన ఏ ఉత్తరమైనా, ప్రతిపాదనలైనా చర్య తీసుకోకుండా అవి పంపిన కార్యాలయానికి త్రిప్పి పంపివేసే అధికారాన్ని ప్రభుత్వం రాష్ట్రంలోని ప్రతి

గెజిటెడు అధికారికి ఇచ్చింది. ఈ విధంగా త్రిప్పి పంపడం వల్ల జరిగే నష్టానికి, జాప్యానికి బాధ్యత ఇంగ్లీషులో వ్యవహరించిన కార్యాలయాధిపతి మీదే ఉంటుందని ప్రభుత్వం స్పష్టం చేసింది.

మార్చి నెల ఉత్తర్వులలో ఈ అంశం ప్రత్యేకంగా రాష్ట్రంలోనూ, రాష్ట్రంవెలుపలా కూడా కొంత సంచలనం కలిగించింది. "ఇంగ్లీషును ఒక తాపు తన్నిన ఆంధ్రప్రదేశ్" అంటూ ఈ వార్తను ప్రముఖ ఇంగ్లీషు దినపత్రిక "హిందూ" సంచలనాత్మకంగా ప్రచురించింది. ఆ మరునాడు ఢిల్లీ నుండి వెలువడుతున్న ఇంగ్లీషు దినపత్రిక "హిందూస్థాన్ టైమ్స్" ఆంధ్రప్రదేశ్ భాషా విధానం మీద సంపాదకీయ విమర్శ చేసింది. రాజస్థాన్ ప్రభుత్వం మన ఈ చర్యను బహుధా ప్రశంసిస్తూ వివరాల కోసం వ్రాసింది. అలాగే కర్ణాటక ప్రభుత్వం కూడా.

జిల్లాకు సంబంధించినంత వరకు ప్రతి నెలా జిల్లా కలెక్టరు జరిపే ప్రగతి పథం సమీక్షా సమావేశంలో తెలుగు వాడకం అన్న అంశాన్ని కూడా సమీక్షించాలని, ప్రతి నెలా జిల్లాలోని 10 కార్యాలయాలను ఆకస్మిక తనిఖీ చేసి ప్రభుత్వానికి నివేదికలు పంపాలని ఈ ఉత్తర్వులలో వుంది. ఈ విధంగా జిల్లా అధికార్లు ఇతర శాఖాధిపతులు పూర్తిగా తెలుగు వాడకానికి మారితే, తెలుగు మాతృభాషకాని ఉన్నతాధికార్లు, సిబ్బంది ఎక్కువ శాతంలో ఉన్న సచివాలయంలో కూడా తెలుగు అమలు మరింత వేగంగా సులభంగా జరుగుతుందని ప్రభుత్వం స్పష్టపరచింది. అధికార భాష అమలు విషయికంగా ప్రభుత్వం ఉత్తర్వులను ఏ స్థాయిలో పాటించకపోయినా ప్రభుత్వం దాన్ని తీవ్రమైన విషయంగా పరిగణిస్తుందని హెచ్చరిస్తూ పాలనా భాష విషయంలో ప్రభుత్వ విధానాన్ని జయప్రదం చేసేందుకు అన్ని స్థాయిల్లోనూ అధికార్లు పూర్తి శ్రద్ధ వహించాలని ప్రభుత్వం ఈ ఆదేశాల్లో కోరింది.

## ప్రభుత్వ వ్యూహం

ఈ చరిత్రాత్మకమైన ఉత్తర్వును జారీ చేయడంలో అధికార భాష విషయంలో మొత్తం ప్రభుత్వ యంత్రాంగపు కృషిని ఏకోన్ముఖం చేయాలన్నది ప్రభుత్వ ఆశయం. గ్రామ పంచాయితీ స్థాయిలోనూ, తాలూకా, పురపాలక సంఘాలు, జిల్లాలు, శాఖాధిపతులు, సచివాలయ స్థాయిల్లో తెలుగు అమలును ప్రవేశపెడుతూ ప్రభుత్వం ఇదివరలో అధికార భాషా చట్టాన్ని అనుసరించి నోటిఫికేషన్లు జారీ చేసింది. ఉదాహరణకు 1976వ సంవత్సరంనుంచి జిల్లా కార్యాలయాలలో, 1979వ సంవత్సరంనుంచి శాఖాధిపతుల కార్యాలయాలలో, 1983వ సంవత్సరం నుంచి సచివాలయంలోను అన్ని శాసనేతర అంశాలకు (నాన్ స్టాట్యుటరి) తెలుగును వాడాలని ప్రభుత్వం నోటిఫికేషన్లు విడుదల చేసింది. ఐతే యివి కచ్చితంగా, సంపూర్ణంగా అమలు జరుగలేదన్నది యదార్థం ఈ లోగా ప్రభుత్వం ఇంగ్లీషు స్థానంలో తెలుగు మార్పిడికి అవసరమైన ఇతర ఆదరువులను కూడా కల్పించింది. తెలుగు టైపురైటరు యంత్రాలు సమర్థవంతంగా రూపుదిద్దుకున్నాయి. రాష్ట్రం నలుమూలలా పది వేలకు పైగా తెలుగు టైపురైటర్లు కార్యాలయాలలో పంపకమయ్యాయి. సర్వీసులో ఉన్న టైపిస్టులకు తెలుగు టైపురైటింగులో శిక్షణ కార్యక్రమం పట్టుదలతో నిర్వహించారు. అన్ని కార్యాలయాల్లో ఉమ్మడిగా వాడుకొనేందుకు గాను "న్యాయ, పరిపాలన పదకోశం" తెలుగు అకాడమీ వారు, "కార్యాలయ పదావళి" అన్న చిరుపుస్తకం అధికార భాషా సంఘం వారు ప్రచురించి పంపిణీ చేశారు ఇవి కాక ఆయా శాఖలలో వాడే ప్రత్యేకమైన ఇంగ్లీషు పదాలకు తెలుగు సమానార్థకాలను సూచిస్తూ 50కి పైగా ముఖ్యమైన ప్రభుత్వ శాఖలన్నింటికి శాఖా పదకోశాలు తయారు చేయించి ప్రభుత్వం ఆయా శాఖల సిబ్బందికి అందుబాటులోకి తెచ్చింది. అయితే యింతకు ముందు, ప్రభుత్వ యంత్రాంగపు వివిధ స్థాయిలలో, వివిధ కాలాల్లో తెలుగును ప్రవేశ పెట్టడం వల్ల సమన్వయం లోపించింది. ఇప్పుడు క్రొత్త మార్పుకు

అవసరమైన సన్నద్ధత ఉన్నందువల్ల ఒకేసారిగా ప్రభుత్వ యంత్రాంగం యావత్తు తెలుగును చేపట్టేందుకు పక్వమైన తరుణం వచ్చింది. అందుచేత ఒక ఏడాది ఏడాదినే అధికార భాషా సంవత్సరంగా పరిగణించి ఈ ఏడాదిలో తమ ధ్యేయం నెరవేరాలన్నది ప్రభుత్వ ఉత్తర్వులలోని ఆచరణకు సంబంధించిన ఎత్తుగడ. ఇట్లా నాల్గు వైపుల నుంచి ఒకే సారిగా ముట్టడిస్తేనే దీని ప్రభావం మొత్తం యంత్రాంగం మీద స్ఫుటంగా పడుతుంది.

## కోర్టులలో తెలుగు

ముఖ్యమంత్రిగారి వద్ద జరిగిన పై సమీక్షా సమావేశంలోనే మన రాష్ట్ర న్యాయ యంత్రాంగంలో కూడా తెలుగును ప్రవేశ పెట్టే విషయం ప్రస్తావనకి వచ్చింది. జిల్లా మున్సిఫ్ కోర్టులలో కొన్ని నిర్దిష్టమైన కేసులు విచారిస్తున్నప్పుడు, ఆ కేసులకు సంబంధించిన కార్యకలాపాలు, తీర్పులు లేక ఉత్తర్వులు సాధ్యమైనంతవరకు తెలుగులో వుండాలని 1981వ సంవత్సరంలో ప్రభుత్వం శాసనపరంగా ఇచ్చిన ఉత్తర్వులను అధికారులు ముఖ్యమంత్రి దృష్టికి తెచ్చారు. అయితే, జిల్లా కోర్టుల స్థాయివరకు కూడా తెలుగును శీఘ్రమే ప్రవేశపెట్టాలని ముఖ్యమంత్రి గారు అభిప్రాయపడ్డారు. దీని విషయమై హైకోర్టు అధికారులతో ప్రాథమిక చర్చలు జరిపి ఒక నివేదికను తమకు సమర్పించవలసిందిగా వారు న్యాయశాఖ కార్యదర్శిని ఆదేశించారు.

తదనంతరం సచివాలయ అధికారులు హైకోర్టు రిజిష్ట్రారుతో సమావేశమయ్యారు. పొరుగుననున్న తమిళనాడు రాష్ట్రంలోని న్యాయ యంత్రాంగంలో తమిళ భాష ప్రగతిని సమీక్షించారు. అక్కడ 1976వ సంవత్సరం నుంచి జిల్లాస్థాయి క్రిమినల్ కోర్టుల్లోను, 1982వ సంవత్సరం నుంచి సివిల్ కోర్టుల్లోను కూడ తమిళ భాషను కోర్టు భాషగా ప్రకటించిన సంగతి ఈ సమావేశం గమనించింది. మన

రాష్ట్రంలో కూడ జిల్లా స్థాయి కోర్టులలో, యింకా దిగువ కోర్టుల లోనూ పూర్తిగా తెలుగు వాడవలసిన అంశాలను కొన్నింటిని అధికారులు గుర్తించారు. వీటికి హైకోర్టు తమ ఆమోదం తెలుపవలసివుంది. ఈ దిశగా యింకా సంప్రదింపులు, చర్చలు కొనసాగుతునేవున్నాయి.

## మరికొన్ని విజయాలు

అధికార భాషా రంగంలో 1988 సంవత్సరం మరికొన్ని విజయాలను చవిచూసింది. మార్చినెల ఆఖరుకు తెలుగు టైపురైటింగు శిక్షణ పథకం ముగియడంతోటే వెంటనే రాజధాని నగరంలో తెలుగు షార్టుహేండులో శిక్షణ పథకం ఆరంభమైంది. ఈ శిక్షణ ఇంకా కొన సాగుతోంది. ఇంతకు ముందు నగరంలో పట్టుమని 10 మంది కూడా లేని తెలుగు స్టెనోలు ఈ రోజున 150 వరకు వున్నారు. మరో 60 మందికి శిక్షణ 1989 మార్చిలో మొదలైంది.

ఇక ప్రభుత్వ ముద్రణ శాఖకు అనుబంధంగా వుండి అధికార బాషా విభాగపు ఆధ్వర్యంలో పనిచేస్తున్న తెలుగు పరిశోధనా విభాగం సాధించిన విజయం కలికితురాయి వంటిది. తెలుగు, ఇంగ్లీషు రెండు భాషలకు పనికివచ్చే విద్యుత్‌ప్రేరకమీటల ఫలకం (బైలింగ్వల్ ఎలక్ట్రానిక్ కీ బోర్డు) ఈ విభాగం రూపొందించింది. ఇది కేవలం యాంత్రికంగా కాక శబ్దానుగుణంగా (ఫోనోటికల్) రూపొందింది. పైగా ఈ మీటల ఫలకం ఎలక్ట్రానిక్ టైపురైటర్, వర్డు ప్రాసెసర్, టెలిప్రింటర్, ఫోటోటైపు సెట్టర్ ఆఖరున కంప్యూటర్ వంటి వివిధ సాధనాలకు ఉమ్మడిగా పనికి వస్తుంది. 596 రూపాలు వున్న తెలుగు లిపిని 52 రూపాలున్న ఇంగ్లీషు లిపిని ఈ మీటల ఫలకంలో ఒదిగించారు. తెలుగు అక్షరాలు సొగసు చెడకుండా ముచ్చటగా ముద్రణకంటే మిన్నగా రూపు దిద్దుకున్నవి శబ్దాను గుణం కావడంవల్ల కాలం, కాగితం ఎంతో కలిసి వస్తాయి. ఉదా:- "మౌ" అనే అక్షరాన్ని మామూలు టైపురైటరులో నాలుగు

సార్లు వత్తాలి. ఇందులో "మ, ఔ"గా విడదీసుకొని రెండు నిండు అక్షరాలను వత్తితే సరిపోతుంది. ముందు ముందు ఈ మీటల ఫలకాన్ని టెలిగ్రాములకు, టెలెక్సులకు నిరాక్షేపణీయంగా వాడవచ్చు. ఈ రంగంలో మన భాష మిగతా అన్ని భారతీయ భాషలకంటే, కొన్ని అంశాలలో హిందీ కంటే కూడా, ముందంజ వేయడం మనకు గర్వ కారణం.

ఈ విధంగా విద్యుత్‌ప్రేరక మీటల ఫలకం విజయానికి, టైపు రైటింగు విస్తృత శిక్షణ పథకం విజయానికి కారకులైన 19 మంది ఉద్యోగులకు ప్రభుత్వం ఒక్క సారిగా ప్రోత్సాహకాలను ప్రకటించింది. ఒక ఉద్యోగికైతే తక్షణ ఉన్నత పదవిని కట్టబెట్టింది. ఈ ప్రోత్సాహ కాలు ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవమైన నవంబరు 1న ముఖ్య మంత్రి గారు ఉద్యోగులకు అందచేశారు. ఒకే అంశంలో ప్రభుత్వం ఇన్ని ప్రోత్సాహకాలను ఒకేసారిగా ఇవ్వడం రాష్ట్ర పాలనా చరిత్రలో పేర్కొనదగిన విశిష్టాంశం.

అలాగే సచివాలయ ప్రాంగణంలో వివిధ భవనాలకు ఎ,బి,సి,డి వగైరా పేర్ల స్థానాల్లో సమత, సుజల, స్రవంతి, సంక్షేమ, సర్వహిత సంప్రీతి, సుబోధ, సుగమ, సురక్ష వంటి ముచ్చటైన పేర్లు వచ్చాయి. అనూచానంగా కేవలం ఇంగ్లీషులో మాత్రమే ముద్రణ అవుతున్న ప్రభుత్వ డైరీలు 1989వ సంవత్సరానికి తెలుగు, ఇంగ్లీషు రెండు భాషల్లోను వెలువడ్డాయి.

## ఆఖరు నోటిఫికేషను

ఇంకా, రాష్ట్ర ప్రభుత్వ కార్యాలయాల్లో తెలుగువాడకం గురించి ఆఖరుది అని చెప్పదగ్గ ఒక చట్టపరమైన నోటిఫికేషన్ను ప్రభుత్వం అక్టోబరు, 28న జారీ చేసింది. ఇది 1988 నవంబరు 1 నుంచి

అమల్లోకి వచ్చింది. దీనిని అనుసరించి అన్ని ప్రభుత్వ ఉత్తర్వుల జారీకి, ఉత్తర ప్రత్యుత్తరాలకు తెలుగు భాషను వాడాలి. ఇంగ్లీషును వాడరాదు. ఐతే తెలుగుకు అదనంగా రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాల్లో ఆయా మైనారిటీ భాషల వాడకానికి ఈ ఉత్తర్వు భంగకరం కాదని ప్రభుత్వం స్పష్టపరిచింది. కాగా దిగువ చెప్పిన కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో ఇంగ్లీషు వాడకాన్ని ప్రభుత్వం అనుమతించింది:

(1) భారత ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు,

(2) ఇతర ప్రభుత్వాలతో ఉత్తర ప్రత్యుత్తరాలు,

(3) ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం వెలుపలగల ఆంధ్రేతర చిరునామాదారులతో జరిపే ఉత్తర ప్రత్యుత్తరాలు.

ఈ ప్రకటన ఆఖరు ప్రకటన వంటిది అన్నాం. ఇంతకు ముందు జారీ చేసిన ప్రకటనలకు, దీనికి ఒక ముఖ్యమైన వ్యత్యాసం వున్నది. శాసనపరమైన అంశాలకు కూడ తెలుగును వాడాలన్నది ఈ ప్రకటన ముఖ్య ఆశయం, సందేశం. ఇంతకు ముందు ప్రకటనలన్నీ శాసనేతర మైన కార్యకలాపాలకు పరిమితమైనట్టివి. ఇప్పుడిక ఆ విచక్షణ లేకుండా, ఇటు శాసనేతర అంశాలకు అటు శాసనపరమైన (స్టాట్యుటరీ) అంశాలకు కూడా తెలుగును ఉపయోగించాలి. ఐతే ఈ సందర్భంగా మన కోర్టుల భాష ఇంగ్లీషుకదా అన్న సందేహం రావచ్చు. కోర్టుల భాష కూడా క్రమంగా మార్చే ప్రయత్నం జరుగుతున్న సంగతి ఇదివరకే మనం గమనించాం. కోర్టు భాష ఏదైనప్పటికి, ప్రభుత్వ శాఖలు తమ అన్ని ఉత్తర్వులను – అంటే శాసనపరమైన ఉత్తర్వులను కూడా – తెలుగులో జారీ చేయడంలో ఎటువంటి ఆక్షేపణా లేదు. ఏదైనా ఉత్తర్వు వివాదగ్రస్తమై కోర్టుల పరిశీలనకు వెళ్ళినపుడు, కోర్టులు ఆ ఉత్తర్వు యొక్క ఆంగ్ల ప్రతిని తమకు సమర్పించమని అడుగుతారు కాని,

అంతకుమించిన ఆటంకం ఏమీ వుండదు. కోర్టులు అడిగిన మీదట అధికారికంగా ఆంగ్ల ప్రతిని తయారు చేసి పంపవచ్చును. ఐతే, యిటు వంటి వివాదాలలో శాఖలు తమకు తాముగా కోర్టుకు సమర్పించే కౌంటర్లు తదితరమైన పత్రాలు కూడ ఇంగ్లీషులోనే సమర్పించవలసి వుంటుంది. ఇదికూడా కోర్టుల భాష తెలుగుకు మారేటంతవరకే అవసరం అవుతుంది.

1988 సంవత్సరాంతానికి అధికార భాషా సంఘం 21 జిల్లాల పర్యటన ముగించింది. ఒక జిల్లాలో 3, 4 రోజుల పాటు చిన్న, పెద్ద కార్యాలయాలు తనిఖీ చేయ్యటం, ఆఖరు రోజున జిల్లాలోని గెజిటెడు ఆఫీసర్లందరినీ కలెక్టరుగారి అధ్యక్షతన సమావేశ పర్చటం—ఈ పర్యటన శైలి. ఆవిధంగా ప్రతి జిల్లాలో 150 నుంచి 200 వరకు అధికార్లను సంఘం ప్రత్యక్షంగా కలిసి తన సందేశాన్ని వినిపించింది. సంఘ కార్యదర్శి కలెక్టరు కార్యాలయ సిబ్బందికి ఒక శిక్షణ గోష్ఠి నిర్వహిస్తూ వచ్చారు.

## తెలుగు భాషకున్న ఒక సమస్య

ఇక తెలుగు భాష వ్రాయడంలో ఆది నుంచి ఒక సమస్య ఉన్నది. ఐ.ఎ.ఎస్. పరీక్షలో ఎంపికై మన రాష్ట్రానికి కేటాయించబడి ముసోరీలో శిక్షణ పొందుతున్న ఒక రాష్ట్రేతర అధికారి తన అనుభవాన్ని వివరించారు. శిక్షణకాలంలో తనకు తెలుగు నేర్పవలసిన బోధకుడు తనని ఒక ప్రశ్న చేశారు. మీరు మాట్లాడే తెలుగు నేర్చు కుంటారా లేక వ్రాసే తెలుగు నేర్చుకుంటారా అని ఆయనను అడిగారు. ఓహో, యీ రెండు తెలుగులు వున్నాయా అని ఆశ్చర్యపడ్డారు. సరే మాట్లాడే తెలుగు తనకు కాలక్రమేణా ఎలాగో వస్తుందని, వ్రాసే తెలుగే నేర్పవలసిందిగా ఆయన కోరారు. అంటే ఇది మన గ్రాంథిక భాష

అనుకోవచ్చు. అప్పుడు తాను చేసిన తప్పు, దాని వల్ల నష్టం ఈ రోజు వరకు తనకు కనపడుతున్నదని ఆ అధికారి వాపోయారు. నిజానికి ఎలాంటి తెలుగు వ్రాయాలో అన్నది తెలుగు మాతృభాషగా కలవారికి కూడా ఒక సమస్య అని బయటివారికి తెలియదు ఫైళ్లలో, ఉత్తర ప్రత్యుత్తరాల్లో ఎలాంటి తెలుగు వ్రాయాలో, ప్రాంతాలవారీగా వాడే తెలుగు భాషలో చాలా వ్యత్యాసాలు ఉంటాయిగదా అన్న సందేహం మన ఉద్యోగులందరిని పీడిస్తూనే ఉన్నదన్న సంగతి సంఘం జరిపిన రాష్ట్ర పర్యటనల్లో వెంటనే బోధపడింది. అందుచేత ఇంతకుముందు సచివాలయ ఉద్యోగులతో జరిపిన గోష్ఠులలో సంఘాధ్యక్షులు, కార్యదర్శి ఉపయోగించిన భాషాపరమైన సూత్రాలను కూడా ప్రభుత్వం ఈ క్రొత్తగా ఇచ్చిన ఆదేశాలలో చేర్చడం ఒక విశేషం. ప్రభుత్వ శాఖల్లో ఎలాంటి తెలుగును వాడాలి అన్న విషయమై మార్గదర్శకంగా ఆరు సూత్రాలను ఈ ఆదేశాల ద్వారా ప్రభుత్వం ప్రచారం చేసింది. తమ జిల్లా పర్యటనల్లో కలెక్టరు కార్యాలయాల్లోని సిబ్బందికి సంఘం కార్యదర్శి ఈ ఆరు సూత్రాల ఆధారంగా ఒక శిక్షణ తరగతిని కూడా నిర్వహిస్తున్నారు ఈ సూత్రాలను కొంత విపులంగా తెలుసుకుందాం.

## ప్రభుత్వ యంత్రాంగం వాడవలసిన తెలుగు ఒరవడికి

## ఆరుసూత్రాలు

1. ఫైళ్లలో మాట్లాడే భాష రాయాలి. అవతలి వారికి, ఆఖరున ప్రజలకు అర్థం కావడమే పరిపాలనా భాష పరమ ప్రయోజనం.

2. తెలుగులో అనుకుని, తెలుగులో వ్రాయాలి. ఇంగ్లీషులో ఉన్న పూర్వ దృష్టాంతపు (ప్రిసిడెంటు) కాగితాలను మార్గదర్శకంగా ముందుంచుకోవాలి గాని, వాటిని అనువాదం చేస్తూ, తలలు పట్టు కోరాదు

3. తెలుగు పదం చప్పున స్ఫురించినప్పుడు ఇంగ్లీషు మాటను తెలుగు లిపిలో వ్రాయవచ్చు.

4. ఒక ఇంగ్లీషు మాటకు మన పదకోశాలలో తెలుగు మాట లభ్యం కానప్పుడు, దానికి సరైన అనువాదం అనుకుని మనం ఒక తెలుగు మాట వ్రాసినప్పుడు ఆ ఇంగ్లీషు మాటను బ్రాకెట్లలో చూపించాలి.

5. అధికార భాషా విభాగం బయటపెడుతున్న సమాచారాన్ని ఎప్పటికప్పుడు తెలుసుకోవాలి. అధికార భాషా విభాగం ఫోను నెంబర్లు:233765/230111/249; 399.

6. తెలుగు దినపత్రిక చదవడం అలవాటు చేసుకోవాలి. ఈ అలవాటు వల్ల ఒక రకంగా అన్ని సమస్యలకూ పరిష్కారం దొరకుతుంది.

## మాట్లాడే భాష:

ప్రభుత్వ యంత్రాంగం వాడుతున్న తెలుగు భాషా సరళికి పరమ ప్రయోజనం ప్రజలకు అర్థం కావడమేనని ప్రభుత్వం నిర్ద్వంద్వంగా ప్రకటించింది. దీనికి ఫైళ్లలోనూ, బయటకు జారీ అయ్యే ఉత్తరాలలోనూ మాట్లాడే భాష వ్రాయమన్నారు. మాట్లాడే భాష అనగానే ఎవరు మాట్లాడే భాష అన్న ప్రశ్న చాలామందికి వస్తుంది. ఎవరైతే ఫైళ్లు వ్రాస్తున్నారో, ఎవరైతే జారీ కాబోయే పత్రాల ముసాయిదా తయారు చేస్తున్నారో, దీన్ని ఆమోదిస్తున్నారో, వారు మాట్లాడే బాష అని అధికార భాషా సంఘం తమ ప్రచారంలో స్పష్టం చేసింది. మన సాహిత్యంలో చర్చలు, సంవాదాలు చూస్తే, గ్రాంధిక భాష, గ్రామ్య భాష, పండిత భాష, పామర భాష, వ్యవహార భాష, కావ్య భాష ఇట్లా ఎన్నో భాషలు తారస పడతాయి. వీటిల్లో అసలు తెలుగు భాష అన్నది మరుగున పడుతున్నది. తెలుగు ప్రజ మాట్లాడేదే తెలుగు భాష. ఏ

కాలంలో ఏ రకం తెలుగు భాష ప్రజలు మాట్లాడుతుంటే అదే తెలుగు భాష. రాయలసీమ, తెలంగాణా, దక్షిణాంధ్ర కోస్తా జిల్లాల్లో, ఉత్త రాంధ్రంలో, ఆయా ప్రజలు మాట్లాడే తెలుగులో ఎవరు మాట్లాడేది తెలుగు అంటారు? ఆమాటకు వస్తే ఆరు కోట్ల తెలుగు వారిలో ఏ ఇద్దరు మాట్లాడే భాషలో కూడా తేడాలు తప్పకుండా ఉంటాయి. అయితే రాష్ట్రంలో ఏ మారు మూల ఉన్న తెలుగువాడు మాట్లాడే తెలుగైనా, మరో మారుమూల ఉన్న తెలుగువాడికి అర్థం కాకపోవడం అన్నది ఉండదు. ఆయా ప్రాంతాల మాండలికమైన పదాలు, ఆయా వృత్తుల ప్రత్యేకమైన శబ్దాలు, యాసలు అన్నీ జీవనదిలాంటి జీవభాషలో కలిసి పోయిన, విడదీయరాని బిందువులే, పాయలే. ఏ ప్రభుత్వ ఉద్యోగి అయినా వ్యవహార కార్యకలాపాలకు తెలుగు వాడుతున్నపుడు అతను మాట్లాడే తెలుగునే వ్రాయాలి. ఎవరూ తన మాతృభాష తప్పుగా మాట్లడటం అన్నది ఉండదు. అందుచేత మాట్లాడే భాష వ్రాయ మన్నప్పుడు, అతడు వ్రాసే తెలుగు తప్పు తెలుగు అవదు. ఉదాహరణకు తెలుగువాడు "మా కుర్రవాడు బడికి వెళ్ళింది" అనడు. అట్లా అంటే అది తప్పు అవుతుంది మాటలు పలకడంలో వ్యత్యాసాలు తప్పకుండా ఉంటాయి. వ్రాయడం అనాలా? రాయడం అనాలా అన్న సందేహం రావచ్చు. దానికి ప్రమాణం ఆ మాటలు వాడుతున్న తెలుగు ఉద్యోగే. తాను మాట్లాడేటప్పుడు – గ్రామాంతరంలో ఉన్న తన వారికి ఉత్తరం వ్రాస్తున్నానంటాడా, ఉత్తరం రాస్తున్నానంటాడా అనేది తనే తేల్చు కోవాలి. అతను ఆ మాటను ఎలా పలుకుతుంటే అలాగే వ్రాయవచ్చు. దానికి వేరే ప్రమాణాలు అక్కరలేదు. ప్రభుత్వ వ్యవహార కార్యకలాపాల వంటి కొన్ని పరిమిత ప్రయోజనాల కోసం, అతను ఈ సందేహ నివృత్తికి ఏ పండితులను సంప్రదించ నక్కరలేదు; నిఘంటువులను త్రిప్పనక్కర లేదు. తనకి తానే ప్రమాణం. తాను తెలుగు వాడు కనుక తాను వాడు తున్న ఆ మాట చలామణిలో ఉన్నట్లే. ఈ సంగతి పై అధికారులు కానీ, వేరే కార్యాలయాలవారు గాని చివరకు ప్రజలు కానీ అర్థంచేసుకుంటారు.

అలా కాకుండా వేరే ఏ ప్రమాణాలనో ఆధారం చేసుకుని "వ్రాయడం" అన్నది సర్వైనదని శ్రమపడి తెలుసుకుంటాడని అనుకుందాం. వలకు కొబ్బరినూనె వ్రాయడమా, రాయడమా అన్న సందేహం అతనికి మళ్లీ వస్తుంది. వ్రాయడమే సప్రమాణం అనుకొని తలకు నూనె వ్రాయడం అంటాడు. తప్పు అయి అభాసు పాలౌతాడు. తన ప్రమాణాన్ని నమ్ముకుంటే ఈ గజిబిజి, జాప్యం ఉండవు.

ఇలా ఏ ప్రాంతం ఉద్యోగి ఆ ప్రాంతంలోని మాటలు తమ వ్యవహారాల్లో వాడుతూండడం వల్ల అనుకోని రీతిలో తెలుగు భాషకు ఉపకారం జరుగుతుంది.. విశాఖపట్నం హార్బర్ ప్రాంతంలో అక్కడి వారు "డ్రెడ్జర్"ను "తవ్వోడ" అంటారు. రాయలసీమలో "రైలు సిగ్నల్"ను "రెక్కమాను" అంటారు. కృష్ణా జిల్లా గన్నవరం ప్రాంతంలో "ఏరోడ్రోమ్"ను "ఏను" అంటారు. మరి ఈ మాటలు ఎరిగిన ఉద్యోగులు తమ పాలనా వ్యవహారాల్లో వాటిని వాడడం వల్ల పరిపాలనా భాష సుసంపన్నమవుతుంది కృతకత్వం లేని చిట్టిపొట్టి తెలుగు మాటలు ఉల్లాసంగా తెలుగు వీధిలో గంతులు వేస్తాయి.

కాబట్టి ఆరు కోట్ల మంది తెలుగువారు మాట్లాడేది తెలుగే. తెలుగు మాతృ బాష అయిన వాడు తప్పు తెలుగు మాట్లాడడు అన్న సిద్ధాంతాన్ని తిప్పి చెప్పుకోవచ్చు. తెలుగు మాతృ భాష అయిన వాడు ఏ తెలుగు మాట్లాడినా అది సర్వైన, సబబైన, సహజమైన తెలుగే. "నాపేణం బావు లేదు దొరా" అని ఒక పాలెకాపు అంటాడు. అతను మాట్లాడుతున్నది తెలుగు కాదని కాని, అతడు తక్కువ రకం తెలుగువాడనీ కానీ అనగలమా? మిగతా వారికి ప్రాణం అయింది, అతనికి పేణం అయింది. కాని అది తప్పు కాదు. ఉచ్చారణలో వ్యత్యాసం. కొంత కాలం తరువాత పేణం అన్న మాటను కూడా శిష్టులు అంగీకరించవచ్చు. లేదా అతనే దాన్ని మార్చుకొని ప్రాణం అని వాడవచ్చు. మరి ఈనాడు ఉత్తరం

రాయడం అన్న ప్రయోగాన్ని శిష్యులు అంగీకరించారు కదా. అట్లాగే క్రొత్త, పాతలకు బదులు కొత్త, పాతలను సహకవులు, సహోపాధ్యాయులూ ఆమోదించారు.

ఇట్లా అంటే - ప్రభుత్వ వ్యవహార పత్రాల్లో, బాగా వ్రాసిన పత్రాలు, అంత బాగా వ్రాయని పత్రాలు ఉంటాయి, అన్నీ సమానమే, అన్నీ ఒకే గాటు కట్టవచ్చనే అర్థం కాదు. క్రమంగా వ్రాసుకుంటూ పోతే సరళంగా వ్రాయడం అబ్బుతుంది. సమర్థంగా, శక్తివంతంగా వ్రాయడం కూడా అబ్బుతుంది. సూటిగా, స్పష్టంగా వ్రాయడమే, అవతలి వారికి సందేహం, సందిగ్ధత లేకుండా అర్థమయ్యేటట్టు పనం కోరుకోదగ్గది – అన్న అవగాహన అవశ్యం కలుగుతుంది. అనుసరిస్తే అభ్యాసం లేని విద్య అంటూ లేదు కదా. తెలుగు భాషలో బాగానే ప్రభుత్వ భాషలో కూడా కృత్రిమత్వాన్ని, కృతకత్వాన్ని పరిహరించాలి. సహజమైన వాడుకకి ఎంత దూరంగా జరిగితే అంత కృతకత్వమవుతుంది. రేపొక సభ ఉంది, రేపొక సమావేశం జరుగుతుంది, అనవచ్చు. దీన్ని రేపొక సభ జరుగును, రేపొక సమావేశం జరుగబోవును అనడం అనవసరం. ఎందుకంటే అట్లా ఎవరూ మాట్లాడరు. అట్లాగే రేపొక సభ ఏర్పాటు చేయడమైంది, అనే దానికన్నా రేపటికి ఒక సభ ఏర్పాటైంది అనడం ఎక్కువ సూటిగా ఉంటుంది. రేపొక సభ ఏర్పాటు చేయడం జరిగింది అనడం గురికి బారెడు దూరం అవుతుంది. ఈ కారణాలవల్లే ఇంగ్లీషులో అడుగడుగునా కనిపించే 'and' అనే పదానికి తెలుగులో మరియు అని వాడకూడదు. Both Staff and Officers అంటే "సిబ్బంది, అధికార్లు అంతా" అనాలి కాని 'మరియు' వాడకూడదు. అట్లాగే ఇంగ్లీషులో తరచుగా కనిపించే కర్మణి ప్రయోగం Passive Voice తెలుగు భాషకు నప్పదు. A meeting is arranged for tomarrow అన్న వాక్యం ఇంగ్లీషులో బాగానే ఉంటుంది. కానీ తెలుగులో "రేపటికి ఒక సభ ఏర్పాటు చేయబడింది" అనడం కృతకం అనిపిస్తుంది. రేపటికి ఒక సభ ఏర్పాటు

అయింది అనవచ్చు కదా. I ar directed by the Govt. to state అన్నది అదే పద్ధతిలో లాంఛనంగా తెలుగులో వ్రాయాలనుకుంటే, "ఫలానా విషయం తెలియచేయమని నేను ప్రభుత్వంచేత ఆదేశింపబడ్డాను" అని వ్రాయడం కృత్రిమం అవుతుంది తెలుగు సంప్రదాయం ప్రకారం, మహా అయితే, "ఫలానా విషయం తెలియచేయమనె ప్రభుత్వం నన్ను ఆదేశించింది" అనవచ్చు. అందుచేత ఈ "బడు" అన్న ధాతువును సాధ్యమయినంతగా ఉద్యోగులు పరిహరించాలి.

మరొక విషయం చెప్పి ప్రథమ సూత్రంప్నైన వివరణను ముగించవచ్చును. ప్రజలు నిత్య వ్యవహారాల్లో వాడే భాష కొంత ఉంటుంది. అయితే ఒక విషయం, ఒక శాస్త్రం లోతుగా అధ్యయనం చేయాలంటే ప్రత్యేకమైన కొన్ని భావాలకు ప్రత్యేక పదాలు అవసరమవుతాయి. వాటిని సాంకేతిక పదాలు అని లేదా పరిభాష అని అంటారు. ప్రభుత్వ పరిపాలన ఇప్పుడు ఒక శాస్త్రంగా రూపొందించారు. పైగా పరిపాలనలో కొంతలో కొంత చట్టపరమైన అంశాలు చోటు వేసుకుంటాయి. ఒక రకంగా చట్టాన్ని సజావుగా అమలు పరచడమే పరిపాలన. అదే చట్ట సమ్మతం. అదికూడా ఉన్నత న్యాయస్థానాలే తేలుస్తాయి. అంటే పరిపాలనకు తన పరిభాష కాకుండా న్యాయసూత్ర పరిభాష కూడా అవసరమవుతుంది అంటే కొన్ని కొన్ని భావాలకు రూఢి అయిన లేదా రూఢి పరచిన పదాలను వాడవలసి ఉంటుంది. ప్రభుత్వం సచివాలయం నుంచి జారీ చేసే కొన్ని పత్రాలను Govt. Order లు (జి.వో లు) అని వ్యవహరిస్తారు. ఈ అర్థంలో ఆర్డర్ అన్న ఇంగ్లీషు పదానికి ఉత్తరువు అన్న పదాన్ని అందరూ ఉమ్మడిగా వ్యవహరించడం సౌకర్యంగా ఉంటుంది. స్వల్పంగా భేదించే అర్థంలో ప్రభుత్వం కొన్ని Instructions లేదా directions ఇవ్వవచ్చు. ఈ అర్థంలో వేరే ఆదేశాలు అన్న పదాన్ని రూఢి పరచుకోవాలి. అట్లాగే ఇంగ్లీషులో పబ్లిక్ అనే మాటతో కూడిన

పదబంధాలు అనేకం తరచుగా తారసపడతాయి. Public Servant, Public Meeting, Public Transport, Public telephone, Public Order, Public purpose ఎంటివి అనేకం ఉన్నాయి. తెలుగులో పబ్లిక్ అనే దానికి ఒకే పదాన్ని వాడడం కుదరదు. అందుచేత ఆయా అర్థాలు వేర్వేరు మాటలతో ఖాయపరచవలసి వస్తుంది. ఇదిగో ఈ అవసరం తీర్చడానికే పరిపాలనకు సంబంధించి కొన్ని సాధారణ పద కోశాలు ప్రభుత్వం ప్రచురింపవేసింది 1983లో ప్రభుత్వం ప్రచురించిన "కార్యాలయ పదావళి" అట్లాంటిది. అట్లాగే తెలుగు అకాడమీ "న్యాయ, పరిపాలన పదకోశం" ఒకటి ప్రచురించింది. ప్రయివేటు వ్యక్తులు కూడా అక్కడక్కడ ఈ ప్రయత్నాలు చేస్తున్నారు. ఈ నిర్దిష్ట ప్రయోజనం కోసం ఉద్యోగులు ఈ పదకోశాలను సంప్రదిస్తూ ఉండాలి. అదే విధంగా ప్రభుత్వం లోని కొన్ని శాఖలకు కొన్ని ప్రత్యేక పదాలు అవసరమవుతూ ఉంటాయి. ఆ పదాలను మిగతా శాఖలు అంతగా ఉపయోగించవు. పశు సంవర్ధక శాఖకు కావలసిన ప్రత్యేక పదాలకు, సాగునీటి శాఖకు కావలసిన ప్రత్యేక పదాలకు చాలా తేడా ఉంటుంది. అందుచేత ఆయా శాఖలకు సంబంధించి ప్రత్యేకంగా పదకోశాలు అవసరం అయ్యాయి. అందువల్లే ముఖ్యమైన 50కి పైగా ప్రభుత్వ శాఖలకు ఇలాంటి శాఖా పదకోశాలు తయారు అయి వాడుకకు సిద్ధంగా ఉన్నాయి. మిగతావి తయారవుతున్నాయి. ఆయా శాఖల ఉద్యోగులు వీటిని సంప్రదించడం వల్ల అపార్థానికి తావులేని విధంగా తమ వ్యవహారాలు సాగించగలుగుతారు.

## తెలుగులోనే అనుకుని వ్రాయాలి

ఇక మన ఆరు సూత్రాల్లో రెండవ సూత్రం తెలుగులో అనుకొని తెలుగులో వ్రాయాలని చెబుతోంది. ఇంగ్లీషులో ఉన్న పూర్వ దృష్టాంతపు కాగితాలను మార్గదర్శకంగా ఉంచుకోవాలి కాని వాటిని తెలుగులోకి అనువాదం చేస్తూ తలలు పట్టుకోరాదని కూడా ఈ సూత్రం హితవు

చెప్పిండి· ముఖ్యంగా మక్కికి మక్కిగా అనువాదాలు చేసే పనిని ఉద్యోగులు చేపట్టకూడదు తెలుగులోనే అనుకుంటూ వ్రాస్తే అరగంటలో అయ్యే పని అనువాదం చేస్తూ కూర్చుంటే 6 గంటలకూ కూడా తెమలదు The attention of the Director is invited to the referance cited above and ఉన్న ఇంగ్లీషు వాక్యం ఉన్నదనుకోండి సంచాలకుని అవధానాన్ని (దృష్టిని) పైన పేర్కొనబడిన నిర్దేశమునకు ఆహ్వానించడమైనది మరియు ఈ పద్ధతిలో తెలుగు వ్రాయకూడదు ఎందుకంటే తెలుగులో ఈ విధంగా వ్యవహరించరు, మాట్లాడరు మనం చెప్పదలచుకున్న సంగతి స్పష్టమే కదా దాన్ని మనం వ్యవహార పరంగానే భావించుకోవాలి "పైన పేర్కొన్న నిర్దేశాన్ని సంచాలకుడు గమనించి " అని వ్రాస్తే సరిపోతుంది ఏ భాష సంప్రదాయం ఆ భాషకు ఉంటుంది· ఒక సంప్రదాయం గొప్పది, మరొక సంప్రదాయం పేదది అనడం సరైందికాదు ఇంగ్లీషులో డిస్ట్రిక్టు కలెక్టరు, మహబూబ్‌నగర్ అనే దాన్ని తెలుగులో మహబూబ్ నగర్ జిల్లా కలెక్టరు అని వాడాలి·

ఉద్యోగులు వాడే పొట్టి సంతకాలు, పొడుగు సంతకాలు గురించి కూడా ఇక్కడ ఒక మాట చెప్పుకోవచ్చును ప్రభుత్వ కార్యాలయాల్లో హాజరుపట్టీలో పేర్లు తెలుగులోనే ఉంటాయి ఐతే సంతకాలు రోజూ పెట్టడానికి ఇచ్చే గడిలో పూర్తి సంతకాలు పెట్టే చోటు ఉండదు అందు చేత పొట్టి సంతకాలు ఏ భాషో తెలియకుండా పొడి అక్షరాలతో సంతకాలు చేస్తూంటారు అడవికొలను సదానందం అన్న పేరు ఉందను కోండి, దాన్ని ఎ ఎస్ అని పొడి అక్షరాలు వ్రాస్తేనే పొట్టి సంతకం అవుతుందని అనుకోనక్కరలేదు ఆ అక్షరాలనే తెలుగు లిపిలో వ్రాసి నంతమాత్రాన తెలుగులో పొట్టి సంతకం అవదు ఇంగ్లీషు ఫక్కీలో అ స అని కూడా వ్రాయనక్కరలేదు పొట్టి సంతకాన్ని ఆయన "సదా" అనో, "ఆనంద్" అనో ఆఖరికి "కొలను" అనో· స్థిరపరచుకొని

వ్రాయవచ్చును పూర్తి సంతకం చేయవలసినప్పుడు అ సదానందం అని వ్రాసుకోవచ్చు ఇప్పటికే ఉద్యోగాల్లో ఉన్నవారి పేర్లు తమ సర్వీసు రిజిస్టర్లలో ఒక విధంగా నమోదు అయి ఉంటాయి పెన్షన్ వంటి విషయాల్లో గొడవలు రాకుండా వీరు ఆ పేర్లనే తెలుగులో వ్యవహరించ వచ్చు కాని కొత్తగా చేరే ఉద్యోగుల సర్వీసు పుస్తకాల్లో తెలుగు బాణీ లోనే పేర్లు నమోదుచేసి తెలుగులో సంతకాలు పెట్టేటట్లు ప్రోత్సహించాలి.

## కృతక అనువాదాలు

ఇక మూడవ సూత్రం – తెలుగు పదం చప్పున స్ఫురించనప్పుడు ఇంగ్లీషు పదాన్ని తెలుగు లిపిలో వ్రాయవచ్చునని చెబుతుంది దీనినే "ట్రాన్స్‌లిటరేషన్" అని ఇంగ్లీషులో అంటారు ఆ ప్రక్రియను ఉపయో గించడం తెలుగు భాషకు ఏమీ న్యూనత కాదు వ్యవహారంలో అనేక ఇంగ్లీషు మాటలను తెలుగు మాటల్లా అనిపించినవి రూఢంగా వాడు తూనే వున్నాం "జిల్లా కలెక్టరు" అన్న మాట చూడండి "జిల్లా" పారశీక శబ్దం, "కలెక్టరు" ఆంగ్లం ఇది తెలుగులో విడదీయరాని పద బంధం అయింది వ్యాకరణ భాషలో చెప్పాలంటే యిది పరమ దుష్ట సమాసం. వీరేశలింగం గారి కాలంలో బ్రిటిషు దొరలకు మహజర్లు పెట్టేప్పుడు కలెక్టరును "మహా మండల కరగ్రాహి" , అని వాడేరు. "కరం"అన్న మాటకు ఉన్న అనేక అర్థాలలో పన్ను ఒకటి పన్ను సంగ్ర హించే ఒక మహామండల అధికారి అని అర్థం ఈ మాటను యిప్పుడు వాడితే నవ్వులపాలవుతాం ఉద్యోగులకు కాదు గదా ప్రజలకు ఏమాత్రం బోధపడదు కేవలం తెలుగు వాడాలి – అన్న పంతానికి పోయి అసలు పరిపాలనా భాష ప్రయోజనాన్ని విస్మరించరాదు దాని ప్రయోజనం పరిపాలన వ్యవహారాలు పూర్తిగా ప్రజలకు తెలియడమే ఒక జిల్లా కార్యాలయంలో ఒక అధికారి తన కార్యాలయం బోర్డుమీద "కార్య నిర్వాహక అభియంత కార్యాలయం" అని రాయించారు. ఇది మేము

తనిఖీకి వెళ్ళవలసిన కార్యాలయమా కాదా మా తనిఖీ బృందానికి బోధ పడలేదు. తీరా తరువాత లోపలకు వెళ్ళి విచారిస్తే ఇది ఎగ్జిక్యూటివు ఇంజనీరు కార్యాలయమని చెప్పారు మరి అందరికీ తెలిసిన ఇంజనీరు అన్న పదానికి బదులు ఈ అభియంతని ఏమూలనుంచి పట్టుకొచ్చారో తెలియదు పని మీద ఆ కార్యాలయానికి వచ్చిన పౌరుడు తికమక పడతాడేమో, అతనికోసం గదా మనం ఈ బోర్డు రాయించిందీ అన్న స్పృహ ఆ అధికారికి లేదు పరిపాలన అన్నది తమ లాగా కొందరి విద్యా వంతుల ఉద్యోగాలకు, ప్రమోషన్లకు, అధికారాలు చెలాయించడానికి అని యింకా నమ్ముతున్న వర్గం యిప్పటికీ ఉందని అనుకోవాలి ప్రజలకు పంపే లేఖలు తెలుగులోనే పంపిస్తున్నారా — అన్న ప్రశ్నకు ఒక అధికారి యిచ్చిన సమాదానం చిత్తగించండి "ఈ కార్యాలయానికి ప్రజలతో సంబంధం లేదు" అని జవాబు రాశాడు ఇది ఏ కార్యాలయమ్మో వుండి వుంటుందీ మీరు ఊహించుకోగలరా? సాక్షాత్తూ సమాచార, జన సంబంధ శాఖ ఉప సంచాలకుని కార్యాలయం! ఇ ఇ అర్థంలోనే మరొకాయన "కార్యనిర్వాహక సాంకేతిక అధికారి" అని వ్రాశాడు సాంకేతిక అదికారి ఒక్క ఇంజనీరే ఎలా అవుతాడు? హైడ్రాలజిస్టు కూడ సాంకేతికాధికారే అందుచేత ప్రస్తుతానికి ఇంజనీరు అనే మాటను యధా తధంగానే వాడడం సర్వులకు శ్రేయస్సు కదా! మరొక కార్యాలయం వారు "మాదక ద్రవ్య పర్యవేక్షణాధికారి" అని రాయించారు కొంత దర్యాప్తు చేశాక యిది " అబ్కారీ సూపర్నెంటు" అనడానికి వచ్చిన తెగులు అని తెలిసింది. "అబ్కారీ" అన్న మాట అనూచానంగా వస్తున్నది ఇది ఉర్దూ మాట కదా అని వారి అభ్యంతరమేమో తెలియదు అలా అనుకున్నా ఎక్సైజుకు మాదక ద్రవ్యాలకు సంబంధం లేదు. తెలుగు రాయాలి అన్న తొందరలో వెనకా ముందూ చూసుకోని 'పిచ్చితనం ఈ అనువాదం

మరి శిస్తు, కిస్తు, రాయితీ, మాఫీ, మహజరు, అర్జీ, జరూరు యిట్లాంటి వందలాది ఉర్దూ మాటలు పాలనా పరిభాషలో ముఖ్యంగా రెవెన్యూ శాఖ పరిభాషలో ఏనాడో కలిసిపోయాయి. కొన్నయితే గుర్తు పట్టలేనంతగా తెలుగు మాటలయ్యాయి. ఉదాహరణకి – రోజు, తేడ వంటివి. ఇక ఇంగ్లీషు మాటల సంగతి చెప్పేదేముంది. ఈనాడు రైలు, రోడ్డు, బస్సు, టికెట్టు, అని వాడడం తప్పుతుందా? ఇప్పుడు వాటికి అర్జంటుగా తెలుగు మాటలను తయారించాలా? ఏం ప్రయోజనం ఆశించి? తెలుగు ప్రజలకు తెలిసిన మాటలుండగా తెలియని మాటలు వారి పైన రుద్దడం తెలుగు భాషకు గాని తెలుగు ప్రజకు గానీ ఉపకారం కాదు.

అధికార భాషా సంఘపు మాజీ అధ్యక్షులు డా. కొత్తపల్లి వీరభద్ర రావు గారు తమ ప్రసంగాలలో ఒక వాక్యం చెబుతూ వుండేవారు. "నేను రైలు స్టేషనుకు వెళ్ళి, క్యూలో నిలబడి టిక్కెట్టు రిజర్వేషను చేయించాను". ఈ మాట లన్నీ గ్రామీణ వ్యవహారంలో కూడ ఉన్నాయి. ఈ మాటలను తెలుగులో వాడడంలో వీసం కృతకత్వం లేదు. ఇలాగే తెలంగాణా ప్రాంతంలో కొన్ని ఉర్దూ మాటలు విస్తారంగా కనిపిస్తాయి. తెలుగు జాతి ఈ విజాతీయ పదాలను స్వంతం చేసుకున్నదని భావించాలి. ఇట్లా రూఢిగా తెలుగువాడుక లోనికి రాని కొన్ని ఇంగ్లీషు మాటలకు తెలుగు సమానార్థకాలు ప్రభుత్వం సరఫరా చేసిన పదకోశంలో లేవనుకుందాం. ఉదా. ఫోకల్‌పాయింట్ అన్న మాటకు తెలుగు అర్థం దొరకకపోవచ్చు. ప్రస్తుతం దాన్ని తెలుగు లిపిలో అలాగే వ్రాయవచ్చు అని ఈ మూడవ సూత్రం చెబుతుంది. అందువల్ల వాడకంలో దానికి క్రమంగా ఎవరో కీలక స్థానం అనో, అంతకంటే మరింత మంచె మాటో వాడవచ్చు. అది క్రమంగా ప్రాచుర్యం పొందవచ్చు. ఫోకస్ అన్న మాట మరింత యిబ్బంది పెడుతుంది. ఆ మాటకు వస్తే, ప్రస్తుతం పదకోశంలో ఉన్న అనువాదాలు శాశ్వతమని వాటిని ఎక్కడపడితే అక్కడ

అదే రూపంలో ప్రయోగించవచ్చని కూడా చెప్పలేము. పదకోశాలు, నిఘంటువులు పండితులైన వాళ్లు నిత్యం సవరిస్తూ, మళ్లీ మళ్లీ కొత్త కూర్పులు ప్రచురిస్తూంటారు కదా,

అయితే ఏ మాత్రం శ్రమ తీసుకోకుండా అయినదానికి కానిదానికి ఇంగ్లీషు మాటలు వాడడానికి దీనిని లైసెన్సుగా భావించరాదు. అప్రూవలు అనే మాటకు అనువాదం మన పదకోశంలో దొరుకుతుంది. ఒక్క క్షణం ఆలోచించినా తడుతుంది. ఆమోదం అని వ్రాయాలి. పరిపాలనలో దీనికీ, రేటిఫికేషన్ అన్న దానికి స్వల్పంగా వ్యత్యాసం ఉంది. ఒక పనికి ముందుగా తీసుకున్న అనుమతి ఆమోదం. వ్యవధి లేక పని పూర్తి అయ్యాక పొందే అనుమతి రేటిఫికేషన్ అవుతుంది. ఈ రెండవ పదానికి మన పదకోశంలో అనుమోదం అని తేలికగా పట్టుబడే ఒక కొత్త మాటను సృష్టించారు. అట్లాగే కన్‌కరెన్సుకు సమ్మతి అన్నారు. వీటన్నిటికి స్వల్ప భేధాలు ఉన్నాయి. ఒక ఉద్యోగి తన తొందరలో ఒక ఇంగ్లీషు మాటకు సమానార్థకమనుకుని వేరే మాటను వ్రాయవచ్చు. ఐతే తను అనుకున్న అర్థం వేరేవారికి చేరదు. ఈ ప్రమాదం నివారించేందుకు తన మనస్సులో ఏ ఇంగ్లీషు మాట ఉన్నదో దాన్ని బ్రాకెట్లలో చూపించాలని మన నాలుగవ సూత్రం హెచ్చరిస్తున్నది. దీనివల్ల అనుమానానికి, అపార్థానికి తావు ఉండదు. ఇట్లా ఇంగ్లీషు మాటను ఏ రకంగా వాడుతున్నా, దాన్ని తెలుగు లిపిలో వ్రాయడం అవసరం. దీనివల్ల టైపు చేయవలసిన టైపిస్టు మాటిమాటికి రెండు మిషన్లను వాడవలసిన బాధ తప్పుతుంది.

## పరభాషా శబ్దాల వాడుక తెలుగుకు న్యూనత కాదు

పరభాషా శబ్దాలను తెలుగులో ధారాళంగా వాడడంవల్ల అది తెలుగు భాషకు న్యూనతగా భావించనక్కరలేదని అన్నాము. ఇది తెలుగు భాష లోపాన్నో, అశక్తతనో రుజువు చేయదు. భాషల తత్వాలే అంత. ప్రతి భాష తన సంపర్కంలోనికి వచ్చిన వేరే భాషల మాటలను ఎన్నింటినో సేకరిస్తుంది. ఈ దేశ చరిత్రలో ఎన్నో శతాబ్దాల పాటు పారశీకం, ఆ

తరువాత ఆంగ్లం రాజ భాషలుగా ఉన్నాయి. అంతకుముందు కనీసం ఒకవేయి సంవత్సరాలకు పైగా సంస్కృతం రాజ భాష గానే కాక మత భాషగా, శాస్త్ర భాషగా ఈ దేశంలో ఎంతో ప్రాముఖ్యంలో ఉంది. చాలా కాలంగా పండితులుకూడా సంస్కృతమే తెలుగుకు మూలమైన తల్లిభాష అని అనుకుంటూ వచ్చారుకూడా. మరి సంస్కృత శబ్దాలు అసంఖ్యాకంగా తెలుగులో ఎలా కలిసిపోయాయో అలాగే పారశీకం; తద్వారా ఉర్దూ, ఆపైన ఇంగ్లీషు మాటలు కూడా కలిసిపోవడం తథ్యం. అంతేకాదు ఆ ఇల్లు ఈ ఇంటికి ఎంత దూరమో, ఈ ఇల్లు ఆ ఇంటికి అంతే దూరం. తెలుగు భాషలోంచి ఇదే విధంగా ఎన్నో మాటలు ఉర్దూ, ఇంగ్లీషు భాషల్లోకి ప్రవేశించాయి. ఢిల్లీకి చెందిన ఓరియంటల్ పబ్లిషర్సు 1968లో హాబ్సన్–జాబ్సన్ పేరుతో ఒక నిఘంటువు యొక్క రెండవ కూర్పు ప్రచురించారు. భారతీయ భాషలనుంచి ఇంగ్లీషులోకి చేరిపోయిన 5 వేలకు పైగా పదాలను ఈ నిఘంటుకారులు పేర్కొన్నారు. తెలుగు, తమిళం నుంచి ఇంకా ఉత్తరాది భాషలనుంచి పండిట్, సిపాయి, బందోబస్తు, బేండికూట్, వరండా, మహారాజా, ఏనికట్, మాంగో– ఇట్లా ఎన్నో పదాలు ఈ రోజున ఇంగ్లీషు మాటలు అయ్యాయి. ఏ ఇతర జాతి కన్నా చరిత్రలో ఎక్కువ విస్తృతమైన సామ్రాజ్యాన్ని స్థాపించి ఎక్కువ దేశాలతో సంపర్కం కలిగిన జాతి ఆంగ్ల జాతి. ఆ అన్ని దేశాల, అన్ని జాతుల మాటలు ఎన్నో ఈ రోజున ఇంగ్లీషులో ఉన్నాయి. ఇక తన మూల భాషలయిన లాటిన్, గ్రీక్‌ల నుంచి సరేసరి. ఆంగ్లో సాక్సన్ కుటుంబానికి చెందిన ఈ ఇంగ్లీషు భాషకు ఆదిలో అన్ని నాగరిక భాషల మోస్తరుగానే సుమారు పదిహేనువేల మాటలు ఉండేవి. మరి ఈనాడు భాషావేత్తల అంచనా ప్రకారం ఇంగ్లీషు భాషకు సుమారు నాలుగున్నర లక్షల పదకోశం ఉన్నది. మరి ఈ అదనంగా వచ్చి చేరిన 4 లక్షల 35 వేల మాటలు అన్య దేశ్యాలని వేరే చెప్పనక్కరలేదు. ఈ లెక్కన చూస్తే అన్ని భాషల్లోకి అత్యధికంగా సంకరమైన భాష ఇంగ్లీషే. ఈనాడు ఏ వర్ణం, ఏ జాతీ స్వచ్ఛం కానట్లే, ఏ భాషకూడా స్వచ్ఛంగా ఉండడానికి

వీలులేదు. ఆమాటకు వస్తే జీవ జంతు జాలాల్లో జాతి సంకర ప్రక్రియతో ఎక్కువ బలిష్టమైన, అందమైన, ఆరోగ్యకరమైన జాతులను పుట్టించవచ్చు. ఇది మానవ జాతికి వర్తిస్తుందంటే ఒప్పుకోరేమో కాని భాషలకు తప్పకుండా వర్తిస్తుంది. అయితే అన్యదేశ్యాలను కలుపుకొనే ఒక రకమైన ఒడుపు ఒక్కొక్క భాషకు ఎక్కువగా ఉంటుంది. అది ఇంగ్లీషు భాషకు ఉన్నదని అనడం నిర్వివాదాంశం. ఈ ఒడుపు మన తెలుగు భాషకు కూడా ఉన్నట్లు జె.బి.ఎస్.హాల్డేన్ వంటి విదేశీయులు కూడా అంగీకరించారు. నిర్మోహంతో చూస్తే ఇది గర్వించ దగ్గ విషయం.

భాషా తత్వం ప్రసక్తి వచ్చింది కనుక మరి ఒకటి రెండు అంశాలు కూడా పరిశీలిద్దాం.

ప్రభుత్వం చాలాకాలంగా అనేక ఉత్తర్వులు యిస్తూ శతపోరుతున్నా రాష్ట్ర పరిపాలనలో ఉద్యోగులు పూర్తిగా తెలుగుకు మళ్ళకపోవడానికి కారణాలేమిటో కొంచెం లోతుగా చూడాలి. అలవాటు ఒక పట్టాన వదల దన్నది యదార్థం. ఉద్యోగులు చాలా కాలంగా ఇంగ్లీషు ఒరవడికి అల వాటు పడివున్నారు. ఈ ఉద్యోగులలో నలభై ఏళ్ళ వయసు దాటిన వాళ్ళు, ఇంగ్లీషు కొంతలో కొంత గాఢంగానే అభ్యసించారు. వీరిప్పుడు కొంత ఉన్నత పర్యవేక్షక స్థానంలో వుంటారు. కనుక వీరి అలవాటే వీరి మాటే చెల్లుబడి అవుతూ వుంటుంది. ఈ అలవాటే కాక కొన్ని అపోహలు కూడ వుండవచ్చును ఇంగ్లీషు అంతర్జాతీయ భాష అని, సాంకేతిక విజ్ఞాన శాస్త్రాలకు అది కరదీపిక వంటిదని అది లేకపోతే మన జీవితంలో వెలుగు తగ్గిపోతుంది – వంటి అభిప్రాయాలు కూడ వున్నాయి. నిజానికి ఈ అభిప్రాయాలలో ఎంత సత్యం ఉన్నా, లేకపోయినా మన ముందున్న సమస్యకు, వాటికి అంత దగ్గర సంబంధం ఏమీలేదు. పరిపాలనలో తెలుగు ప్రవేశపెట్టడానికి మరొక భాష మీద, అది ప్రాతినిధ్యంవహించే ఒక సంస్కృతి మీద యుద్ధం ప్రకటించవలసిన అవసరం లేదు. అందుచేత మన విద్యకు, పరిపాలనకు మనం వాడే భాషలకు ఉన్న పరస్పర సంబంధాలను కొంతయినా దర్యాప్తు చేయకతప్పదు.

## విద్యకు మాతృ భాష, పాలన ప్రజల భాష
## శిశువుకు తల్లిపాల వంటిది

శిశువుకు మాతృభాష ముందు అబ్బుతుంది. శిశువు ఆరోగ్యానికి తల్లిపాలు ఎంత సహజమో, ఆరోగ్యకరమో ప్రాథమిక విద్యార్థికి మాతృ భాష అధ్యయనం, మాతృభాషలో విద్యార్జన అంత సహజమూ ఆరోగ్య కరమూ అని అన్ని దేశాల, కాలాల విద్యావేత్తలు అంగీకరించిన విషయం. ఒకటి దేహ దారుఢ్యానికు ఎంత అవశ్యకమో రెండవది మానసిక వికాసానికి అంత ఆవశ్యకం. ఇదే విధంగా పరిపాలన ఆయా ప్రజల భాషలో జరగాలన్నది ప్రజాస్వామ్య పటిష్టతకు, పరిణతికి అంత సహజమూ ఆవశ్యకమూ. ఈ విషయం కూడ సార్వజనీనంగా, సార్వకాలికంగా అంగీకరించిన పరిపాలన ఎట్లా ఏ విధంగా జరుగుతున్నదో దాని ఫలితాలకు ప్రత్యక్ష వారసులైన ప్రజలకు క్షుణ్ణంగా తెలియాలి. అది తప్పుదోవ పట్టినపుడు దానిని సరిదిద్దుకోవలసిన బాధ్యత వాళ్ళదే. వాళ్ళకు ప్రమేయం లేని, వారు శ్రద్ధాసక్తులతో నిమగ్నం కాని పరిపాలన నిష్ప్రయోజనం.

ఒక్క మాటలో– విద్యకు మాతృభాష, పరిపాలనకు ప్రజల భాష, శిశువుకు తల్లిపాల వంటిది అంటున్నాం. ప్రాథమిక విద్యతో బయలుదేరిన విద్యార్థి ఉన్నత విద్యను, శాస్త్ర సాంకేతిక విజ్ఞానాన్ని అదే భాషలో అభ్యసించడమే సహజం, వాంఛనీయం. ఇట్లాఅన్నప్పుడు మరి తెలుగు భాష ఉన్నత శాస్త్ర సాంకేతిక విషయాలకు, న్యాయ పరిపాలనకు తగి నంత సమర్థవంతంగా వుందా, తగ్గ వనరులు సమకూర్చుకుందా–అన్న ప్రశ్న వస్తుంది. దీనికి ఒకటే జవాబు. ఇది "ఈత వచ్చేక నీళ్ళలోకి దిగాలా, నీళ్ళలోకి దిగితే ఈత వస్తుందా"– అన్న ప్రశ్న లాంటిది. ఏ భాష లేక పరిభాష దానంతట అది తయారవదు. లేదా కొందరు భాషా శాస్త్రజ్ఞులు ఒక ప్రయోగశాలలో దానిని తయారుచేయరు. భాషను ఆయా ప్రయోజనాలకు వినియోగించడం ప్రారంభిస్తేనే ఆ దిశగా భాష వికసిస్తుంది అవసరమే కొత్త సృష్టికి మూలం, తల్లి మన దేశభాషలలో ఉర్దూ ఏ కాలంలోనూ అధిక సంఖ్యాక భాష కాదు. అయినా దానిని

పరిపాలన అవసరాలకు వినియోగించబట్టే అవసరానికి తగ్గ ఎత్తుకు అది ఎదిగింది. అట్లాగే దానిని ఉన్నత విద్యకు కూడ మన ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉపయోగించబట్టే మానవీయ శాస్త్రాలకే కాక తదితర పదార్థ, రసాయనిక, జీవ శాస్త్రాలకు, న్యాయ పరిపాలనకు సరిపడా వికాసం పొందింది. మరి విజ్ఞాన శాస్త్రాలలో, పరిశ్రమలలో ప్రపంచంలో అగ్రగామిగా ఉన్న జపాను, జర్మనీ దేశాలలో, రష్యాలో ఆయా భాషలనే అన్ని ప్రయోజనాలకు ఉపయోగించారు, ఉపయోగిస్తున్నారు కాని ఆంగ్లం కాదు గదా! ఏ విద్యార్థి అయినా ఒక విదేశం వెళ్ళాలనుకున్నపుడు ఆ విదేశీ భాషను కొంత మనదేశంలోను, కొంత ఆ దేశంలోను అభ్యసిస్తాడు. ఒక ఆరు మాసాల కాలం దీనికి చాలునని ఆచరణలో రుజువయింది.

ఇట్లా చెప్పడం ఇంగ్లీషు విలువను, దాని అంతర్జాతీయ స్థాయిని కించపరచడం కాదు. ఒకరు కించపరిస్తే అది కించపడే విషయమూ కాదు. ఎలాగూ మన దేశానికి అంతర్జాతీయ రంగంలో ఒక ముఖ్యమైన ఇంగ్లీషు భాషతో సంపర్కం ఉంది కనుక ఆ వారసత్వాన్ని ఆ సంపదను మనం అనువుగా వినియోగించుకోవడంలో తప్పకుండా పక్షపాతం చూపుతాం. అట్లా అని మన దేశ భాషలకు అంటే ప్రాంతీయ భాషలకు సహజసిద్ధమైన కీలకస్థానాన్ని తోసిపుచ్చకూడదు. భాషలలో ఒకటి గొప్పదని మరొకటి పేదదని ఉండదు. నిజానికి భాష అది మాట్లాడే జాతి వికాసస్థాయికి దర్పణం. జాతి ఉన్నతి సాధించాలంటే ఉజ్వలంగా వెలగాలంటే, దాని భాష ఉన్నతిని సాధించవలసిందే, ఉజ్వలంగా వెలగవలసిందే.

ప్రజకు, భాషకు ఉన్న బంధాన్ని ఒక చెట్టుతో పోల్చవచ్చు. మొక్కగా ఉన్నప్పుడు అది శిథిలం కాకుండా చూసి, అది పెరగడానికి తగినవసతులు కల్పిస్తే అది ఆ పైన మానవుతుంది, మహా వృక్షమవుతుంది. నీడ యిస్తుంది, సేద తీరుస్తుంది, ఫలపుష్పాలిస్తుంది. పరిసర

శాస్త్రి విషయంగా చూస్తే జాతిని, దేశాన్ని కాపాడుతుంది. అట్లాగే భాషకూడ. నాగరిక సమాజంలోని అన్ని అవసరాలకు దానిని వాడితే అది చెట్టులాగా విస్తరించి ఎప్పటి కప్పుడు కొత్త తరాలకు జవప్రదమూ స్ఫూర్తిదాయినీ అవుతుంది. ఒక తల్లిని మరొక తల్లితో పోల్చడం అర్థ రహితం. మరొక తల్లి ఎక్కువ విద్యావంతురాలు కావచ్చు, మరింత నేర్పరి కావచ్చు. అయినా తల్లిని ఎవరైనా గౌరవించడం మానగలరా? తన తల్లిని గౌరవించడం ద్వారానే మనిషి మరొక తల్లిని గౌరవించగలడు.

అందుచేత సంఘం అధ్యక్షులు శ్రీ రామకృష్ణమాచార్య తమ రాష్ట్ర వ్యాప్త ప్రసంగాలలో చెబుతున్నట్లు "మకార త్రయం"లో మనుష్యులు (టైపిస్టులు, స్టెనోలు), మరలు (టైపురైటర్లు, ఎలక్ట్రానిక్ సాధనాలు, పదకోశాలు) సిద్ధంగా ఉన్నాయి. ఇక కావలసిందల్లా మూడవ "మ"కారం – అంటే "మనస్సు". ఉద్యోగులు తమ తెలుగు భాష అంటే మమతతో కూడిన మనస్సును పెట్టాలి. తల్లి యెడల నిర్వ్యాజమైన అనురాగము, ఆదరము కనబరచాలి. అక్షరాస్యుడైన ప్రతి తెలుగువాడు ముందు తన మాతృభాష అయిన తెలుగును గాఢంగా అభ్యసించాలి. తరువాత భారతదేశ పౌరుడిగా దేశ అధికార భాషలైన హిందీ, ఇంగ్లీషులలో కనీసం ఒక భాషలోనైనా చక్కటి ప్రవేశం పొందాలి. బహు కొద్దిమంది ఒకటో అరో అభ్యసించవలసిన తదితరమైన భాషలను తీరికగా ఆయా అవసరాలు పడినపుడు తేలికగా నేర్చుకోవచ్చు.

## తెలుగులో వ్రాయటానికి ఎక్కువ సమయం పడుతుందా?

పత్రాలు తెలుగులో వ్రాయటానికి, వాటిని టైపు చెయ్యటాని ఎక్కువ టైం పడుతుందని చాలామంది ఉద్యోగుల నమ్మకం

మొదట్లో తెలుగుకు మళ్లటానికి సహజంగానే కొద్ది యిబ్బంది వుంటుంది. అనుభవ పూర్వకంగా చెప్పేమాట ఏమంటే ఈ యిబ్బంది రెండు నెలల తర్వాత వుండదు ఆ తర్వాత తెలుగు వ్రాయటంలో సరళతా, వేగమూ కూడ పెరుగుతాయి మాతృభాషలో వ్రాస్తున్నాంగనుక స్పష్టతా, వేగమూ మనం యిప్పుడు నమ్మలేనంతగా వృద్ధి అగుతాయి అదే అనువాదం చేస్తూ పోయారో—గొంగళి వేసిన చోటే వుండటం ఖాయం

ఇక టైపు సంగతి టైపిస్టులకు అభ్యాసంవల్ల వేగం వస్తుంది తెలుగు పని ఎంత ఎక్కువ యిస్తూంటే, అంత త్వరగా వాళ్ల నేర్పు పెరుగుతుంది అనుభవంలో వ్రాతగాళ్ళు కొన్ని కిటుకులు కూడ నేరుస్తారు. ఉదాహరణకు, తెలుగు మాటల్లో 'ము' తో అంతం అయ్యే మాటలు అసంఖ్యాకంగా వున్నాయి. ప్రభుత్వము, కార్యాలయము, ఆరోగ్యము, వైద్యము, పుస్తకము, సంవత్సరము, ఆదేశము, ఆహ్వానము, దేశము, రాష్ట్రము, వెళ్లాము, వస్తాము వగైరాలు వీటిల్లో చివర 'ము' వ్రాయకుండా సున్నా చుడితే మీకు ఎంతో సమయం కలిసివస్తుంది. నిజానికి ఉచ్చారణలో 'సున్నా' పలుకుతాం గాని, 'ము' ను వివరంగా పలకం. అందుచేత మన మొదటి సూత్రం ప్రకారం కూడ ఈ పదాలన్నిటి చివరా సున్నాయే రాయాలి ఈ చిట్కా వల్ల టైపిస్టుకు ఎంత హాయో చెప్పలేం. అట్లాంటి ప్రతి మాటలోనూ అతడు నాలుగు వత్తులకు బదులు ఒక్కసారే వత్తుతాడు

మరొక ముఖ్యమైన సంగతి వుంది. ఇంగ్లీషులో ఒక పేజీ విషయాన్ని తెలుగులో వ్రాసి చూశారా? అది ముప్పాతిక పేజీయే అవుతుంది. ఇది రుజువై విద్వాంసులు వొప్పుకున్న మాట. ఒక్కోసారి సగమే అవుతుంది కూడ. మాతృభాషలో సూటిగా, క్లుప్తంగా చెప్ప గలగటమే కాక, తెలుగు భాషాసంపదంతా చిట్టి పొట్టి మాటలు కావటం కూడ కారణం.

## నిశ్శబ్ద విప్లవం

పరిపాలన పూర్తిగా తెలుగుకు మారడాన్ని ఒక నిశ్శబ్ద విప్లవంగా వర్ణించవచ్చు. ఈ విప్లవిస్తున్న సంధి దశలో సర్వీసులో ఉన్న ప్రతి ఉద్యోగీ తాను ఈ విప్లవ పాత్ర వహించవలసిరావడం భాగ్యంగాభావించాలి అధికార భాషా విభాగం బయటపెడుతున్న పదకోశాలను, తదితర సాధనాలను, ఇస్తున్న ఆదేశాలను, చేస్తున్న సూచనలను శ్రద్ధగా గమనించాలి. ఈ సమాచార ప్రసారం విరివిగా జరగాలని ఈ సూత్రాలలో 5వ సూత్రం చెబుతున్నది.

ఇక ఆఖరుది అయినా ఆరవ సూత్రం ముఖ్యమైనదే ప్రతి ఉద్యోగి తెలుగు దినపత్రిక చదవడం అలవాటు చేసుకోవాలని ఈ సూత్రం చెబుతోంది. నిజానికి అది ఒక పనిగా పెట్టుకోవాలి మన ముఖ్యమైన తెలుగు దినపత్రికలు ముద్రణలో గాని, అటు భావ వ్యక్తీకరణలో గాని తెలుగు జాతి గర్వించదగ్గ స్థాయిలో ఉన్నాయి. చక్కటి తెలుగు వ్రాయడానికి ఉద్యోగులు పెట్టవలసిన కృషి కంటె ఎన్నోరెట్లు ఎక్కువ శ్రమ పడతారు తెలుగు పత్రికా రచయితలు, విలేఖరులు ఒక పరిపాలనా రంగమే కాకుండా పక్షుల వలస నుంచి శ్రీహరికోట క్షిపణి ప్రయోగాల వరకు ఎన్నో విషయాలను వాళ్ళు తెలుగు ప్రజకు నివేదిస్తూ వుంటారు. ఎక్కువ భాగం ఇంగ్లీషులో వచ్చే ఈ వార్తలను, నివేదికలను వాళ్ళు సరళము, సుబోధకము, భావస్ఫోరకము అయిన భాషలో వ్రాస్తూ వుంటారు. తెలుగు వాడికి ఒక విజాతీయ భావం బోధపడడానికి అవసరమైన బలాన్ని తెలుగు సంస్కృతి నుంచి భాషా సంప్రదాయం నుంచి సంతరించుకుంటారు. "ప్యాకోర్టు బెంచి" అన్న మాటకు నిరక్షరాస్యుడికి సైతం అర్థమయేట్లు "ధర్మాసనం" అనే తెలుగు మాటను చెలామణి చేసింది వారే కదా! పరిపాలన మనిషి జీవితపు అన్ని కోణాలలోకి చొరబడుతున్న ఈ కాలంలో పరిపాలనకు సంబంధించిన అన్ని ప్రభుత్వ

నిర్ణయాలను, ఆదేశాలను పత్రికలు మారు మూలలకు కూడ ప్రసారం చేస్తున్నందువల్ల వీటిలోని వ్రాతలు ఉద్యోగులకు కల్పతరువులాగా అక్కరకు వస్తాయి.

పరిపాలన తెలుగులో ఉండడం ప్రజల కోసం అంటున్నాం పరిపాలనా వ్యవహారాలలో ప్రజలు చురుకైన పాత్ర వహించడానికి ఇది అవసరం అంటున్నాం.' అదే కొలమానంతో ఈ అధికార భాష ఉద్యమాన్ని జయప్రదం చేయడంలో ఉద్యోగులకు ఎంత బాధ్యత ఉందో ప్రజలకు కూడ అంత ఉన్నది అయితే బ్రిటిష్ వలస ప్రభుత్వ పాలనా విధానాలకు అలవాటు పడిపోయిన ప్రజలు తమకు తెలుగే కావాలని గట్టిగా కోరే స్పృహలో యింకా లేరు ఇంగ్లీషులోనే మహజరు యిస్తే, దరఖాస్తును ఇంగ్లీషులో పూరిస్తేనే తమకు పనులు త్వరగా జరుగుతాయనే భ్రమలో ఈ రోజుకూ ఇంకా అధిక సంఖ్యాక ప్రజలు ఉన్నారు ఈ అపోహను ఉద్యోగులు వమ్ము చేయాలి కార్యాలయంతో ఎవరికి ఏ పని ఉన్నా పూర్తిగా తెలుగులో వ్యవహరించవచ్చు అన్న అభిప్రాయం వారిలో కలిగించాలి, వారిని తెలుగు వాడడానికి పూర్తిగా ప్రోత్సహించాలి. ప్రజలను జాగరూకులను చేయడం పత్రికల విధులలో ఒకటని మనం అంగీకరిస్తే, పత్రికలు ఈ విషయంలో కూడ అప్రమత్తంగా ఉండి, ఇంకా ఏ కార్యాలయమైనా వెనుకబడితే పత్రికలు తప్పకుండా చురకలు పెడతాయి. అట్లాంటి విమర్శ పత్రికల నుంచి రాజకీయ పక్షాల నుంచి మరెక్కడ నుంచైనా రావచ్చు దానిని సహృదయంతో స్వీకరించి అందరమూ తెలుగు జాతి అభ్యున్నతికి భుజం కలుపుతున్నామన్న ఉత్సాహంతో అడుగు ముందుకు వేయాలి. అనాడే మన ఉద్యోగ ధర్మానికి సఫలత, సార్థకతా.

---

మిక్కిలి జరూరు

అధికార భాష 230111-249;399.

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

## ప్రధాన పరిపాలన (అ.భా. 3) శాఖ

మెమో. నెం. 167/అ.భా.3/88-1 తేది. 19-3-1988.

విషయం :-అధికార భాష - తేది. 14-3-88న ఉన్నత స్థాయి సమావేశం నిర్ణయాలు - ఉత్తర్వుల జారీ.

****

గౌరవనీయులైన ముఖ్యమంత్రి తేది 14-3-1988న అధికార భాష సంఘాధ్యక్షులు, నలుగురు సభ్యులతోను, ప్రధాన కార్యదర్శి తదితర సంబంధిత అధికారులతోను అధికార భాష అమలును గురించి ఒక సమీక్షా సమావేశం జరిపారు. ఈ సమావేశంలో ఈ క్రింద చెప్పిన ముఖ్యమైన నిర్ణయాలు తీసుకున్నారు.

(క) తేది. 18-3-1988తో ప్రారంభమయ్యే 'విభవ' తెలుగు సంవత్సరాన్ని ప్రభుత్వం 'అధికార భాషా సంవత్సరం'గా పరిగణిస్తుంది.

(చ) తనకు ఇంగ్లీషులో చేరిన ఏ ఉత్తరాన్నయినా, ప్రతిపాదనైనా ఏ చర్యా తీసుకోకుండా అవి పంపిన కార్యాలయానికి తిప్పి పంపివేసే అధికారం రాష్ట్రంలోని ప్రతి గెజిటెడు అధికారికి వుంటుంది. తమ పైకార్యాలయాల

నుంచి వచ్చినా, ఇట్లా తిప్పి వేయవచ్చును. ఈ విధంగా తిప్పి పంపడం వల్ల జరిగే కష్టనిష్ఠూరాలకు, నష్టానికి, జాప్యానికి బాధ్యత ఉత్తరాలు, ప్రతిపాదనలు ఇంగ్లీషులో పంపిన కార్యాలయాధిపతి మీదే వుంటుంది.

(ట) జిల్లా కలెక్టరు ప్రతి నెలా జరిపే ప్రగతి సమీక్షా సమావేశాలలో తెలుగు వాడకం అన్న అంశాన్ని కూడా అజెండాలో చేర్చి సమీక్షించాలి.

(త) ప్రతి జిల్లా రెవిన్యూ అధికారి తన జిల్లాలో ప్రతి నెలా కనీసం 10 కార్యాలయాలను ఆకస్మిక తనిఖీ చేసి ప్రభుత్వానికి నివేదికలు పంపాలి.

2. పై నిర్ణయాలు వెంటనే అమలులోకి వస్తాయి. సచివాలయ శాఖలు, శాఖాధిపతులు, జిల్లా కలెక్టర్లు అందరూ ఈ నిర్ణయాలను సంపూర్ణంగా అమలు పరచాలని కోరడమయింది. అధికార భాష అమలు విషయికంగా ప్రభుత్వ ఉత్తరువులను ఏ స్థాయిలో పాటించకపోయినా ప్రభుత్వం దానిని తీవ్రమైన విషయంగా పరిగణిస్తుంది అని కూడ హెచ్చరించడమయింది.

3. తేది 2-4-1988 తరువాత, శాసనపరమైన కొద్ది అంశాలు మినహాయించి, సచివాలయంలో ఫైళ్ళన్నీ పూర్తిగా తెలుగులోనే నిర్వహించాలని, అవి ఇంగ్లీషులో కనిపించరాదనీ ప్రభుత్వం ఆదేశాలు యిచ్చింది. అదే విధంగా శాఖాధిపతులు, జిల్లా కలెక్టర్లు తదితర జిల్లా అధికారులూ పూర్తిగా తెలుగు వాడకానికి మారితే, సచివాలయంలో కూడా తెలుగు అమలు మరింత వేగంగా, సులభంగా జరుగుతుంది. ప్రభుత్వ వ్యవహారాలలో వ్రాసే తెలుగు భాష ధారాళంగాను, మాట్లాడే భాషగానూ

వుండాలని అధికార భాష సంఘాలు మొదటి నుంచీ చెబుతూ వస్తున్నాయి. ఈ శైలి విషయంలో అధికార భాష సంఘం రూపొందించిన ఆరు సూత్రాల పత్రాన్ని దీనితో జతపరచడమయింది. ఇదివరలో అనేకమార్లు సూచించినట్టు ప్రస్తుతం అచ్చుఅయి , లభ్యమవుతున్న 'కార్యాలయ పదావళి', "పరిపాలన న్యాయ పదకోశం" వంటి సాధారణ పదకోశాలను విరివిగా ఉపయోగించుకోవాలి. తయారయి సిద్ధంగా ఉన్న ఆయా శాఖల ప్రత్యేక పద కోశాలను కూడా శాఖలలో చిన్నా పెద్దా అన్ని కార్యాలయాలకు సత్వరం పంపిణీ చేసి వాడుకలో పెట్టాలి.

4. జిల్లా కలెక్టరు సత్వరం తీసుకోవలసిన ప్రధానమైన చర్య మరొకటి ఉంది. ప్రధాన పరిపాలన (అ.భా.2) శాఖ జీ.వో.ఎం.ఎస్. నెం. 39, తేది 25-1-1988లో ప్రభుత్వం ఇచ్చిన ఆదేశాల ప్రకారం, జిల్లాలో ఉన్న అన్ని కార్యాలయాలలోను (ప్రాంతీయ కార్యాలయాలతో సహా) అదనంగాఉన్న ఇంగ్లీషు టైపురైటర్లను వెంటనే ఉపసంహరించి ప్రభుత్వానికి నివేదికలు పంపాలి.

5. 'విభవ' సంవత్సరాన్ని అధికార భాషా సంవత్సరంగా పరిగణిస్తూ ఉండడంవల్ల పాలనా భాష విషయంలో ప్రభుత్వ విధానాన్ని జయప్రదం చేసేందుకు, అన్ని స్థాయిలలో అధికారులు ప్రత్యేక శ్రద్ధవహించి తమ విధులను నిర్వర్తించవలసి వుంటుంది. ఈ అమలులో ఏ రకమైన ఇబ్బందులు వచ్చినా తమ ఉన్నతాధికారులకు, ప్రభుత్వానికి తెలియజేసి సమస్యలను వెంటనే పరిష్కరించుకోవాలి.

6. ఈ మెమో చేరినట్లు వెంటనే తెలియజేయగలరు.

**అ. వళ్లియప్పన్,**

ప్రభుత్వ ముఖ్య కార్యదర్శి.

## ఆరు సూత్రాలు

## ప్రభుత్వ శాఖలలో తెలుగు వాడకానికి ఆరు సూత్రాలు

1. ఫైళ్లలో మాట్లాడే భాష రాయాలి. అవతలి వారికి, ఆఖరున ప్రజలకు అర్థం కావడమే పరిపాలనా భాష పరమ ప్రయోజనం.

2. తెలుగులో అనుకుని, తెలుగులో వ్రాయాలి. ఇంగ్లీషులో వున్న పూర్వ దృష్టాంతపు (ప్రిసిడెంట్లు) కాగితాలను మార్గదర్శకంగా ముందుంచుకోవాలి గాని, వాటిని అనువాదం చేస్తూ తలలు పట్టుకోరాదు.

3. తెలుగు పదం చప్పున స్ఫురించనప్పుడు ఇంగ్లీషు మాటను తెలుగు లిపిలో వ్రాయవచ్చు.

4. ఒక ఇంగ్లీషు మాటకు మన పదకోశాలలో తెలుగు మాట లభ్యం కానప్పుడు, దానికి సరైన అనువాదం అనుకొని మనం ఒక తెలుగు మాట వ్రాసినపుడు ఆ ఇంగ్లీషు మాటను బ్రాకెట్లలో చూపించాలి.

5. అధికార భాష విభాగం బయటపెడుతున్న సమాచారాన్ని ఎప్పటికప్పుడు తెలుసుకోవాలి. అధికార భాషా విభాగం ఫోను నెంబర్లు:-233765, 230111/249; 399.

6. తెలుగు దినపత్రిక చదవడం అలవాటు చేసుకోవాలి. ఈ అలవాటు వల్ల ఒక రకంగా అన్ని సమస్యలకూ పరిష్కారం దొరుకుతుంది.

* * * *

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

సంక్షిప్తి.

1966 సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం – ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తెలుగుకు అదనంగా ఉర్దూ లేక యితర భాషల వాడకం – చట్టంలోని 7వ విభాగాన్ని అనుసరించి ప్రకటన జారీ.

ప్రధాన పరిపాలన (అధికార భాష–I) శాఖ

జి.ఓ.ఎం.ఎస్.నెం. 371 తేదీ: 28–6–1988

ఈ క్రింది వాటిని చూడండి:

1. ప్రధాన పరిపాలన (అ.భా. I) శాఖ, జి.ఓ.ఎం.ఎస్.నెం. 472, తేదీ: 4–7–1977.
2. ప్రధాన పరిపాలన (అ.భా.I)శాఖ, జి.ఓ.ఎం.ఎస్.నెం. 358, తేదీ: 26–7–1985.
3. ప్రధాన పరిపాలన (అ.భా.I) శాఖ, జి.ఓ.ఎం.ఎస్.నెం. 603, తేదీ. 5–12–1987.

ఉత్తర్వు:

రాష్ట్రంలో పరిపాలనా భాషగా ఇంగ్లీషు నుంచి తెలుగుకు మరలడానికి ప్రభుత్వం గట్టి ప్రయత్నం చేస్తున్నప్పుడు, రాష్ట్రంలో మాట్లాడే ఉర్దూ తదితర అల్ప సంఖ్యాక వర్గాల భాషల వాడకాన్ని పెంపు చేయుట కూడ అవశ్యకమని భావించడమయినది. 1981 సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం జనాభాలో కనీసం 15 శాతం భాషా పర అల్ప సంఖ్యాకులు వున్న ప్రాంతాలకు పరిపాలనలో వారికి యింతవరకు

కల్పిస్తున్న కొన్ని సౌకర్యాలను వర్తింపజేయాలని, వాటిని నిక్కచ్చిగా అమలు చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది.

2. ఉర్దూ, తదితర అల్ప సంఖ్యాక వర్గాల భాషలు మాట్లాడే విద్యార్థులకు కల్పించే విద్యా విషయక సౌకర్యాలు విద్యా శాఖ ద్వారా ప్రభుత్వం యిచ్చే ఉత్తర్వులను అనుసరించి వుంటాయి.

3. ఆంధ్రప్రదేశ్ గెజిటు తదుపరి సంచికలో ఈ దిగువ ప్రకటనను ప్రచురించగలరు:-

ప్ర క ట న

1966 సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం (1966 సంవత్సరపు 9వ ఆంధ్రప్రదేశ్ చట్టం) లోని 7వ విభాగం ద్వారా లభ్యమయిన అధికారాలను పురస్కరించుకుని, ఈ విషయమై గతంలో జారీ అయిన ఉత్తర్వులను రద్దుపరుస్తూ, ఆంధ్రప్రదేశ్ గవర్నరు గారు ఈ ప్రకారంగా ఆదేశిస్తున్నారు:-

(1) ఈ దిగువ తెలిపిన అవసరాలకు తెలుగు భాషకు అదనంగా ఉర్దూ భాషను కూడా వాడాలి:-

(క) సచివాలయం, మినిస్టీరియలు, జుడీషియల్ మినిస్టీరియల్ సర్వీసులకు నేరుగా చేసే భర్తీకి ఒక ప్రాంతీయ భాషగాను;

(చ) గెజిటెడ్, నాన్‌గెజిటెడ్ సర్వీసులకు ద్వితీయ భాషా పరీక్షల నిమిత్తం ఒక భాషగాను;

(ట) ఆచరణ సాధ్యమయినంత వరకు ఉర్దూ అర్జీలకు సమాధానాలు ఉర్దూలోనే యివ్వడం.;

(త) ఈ దిగువ జిల్లాలలో అనగా - అనంతపురం, కడప, కర్నూలు, గుంటూరు, అదిలాబాదు, హైదరాబాదు, రంగారెడ్డి, కరీంనగరు, ఖమ్మం, మహబూబ్‌నగర్,

మెదక్, నల్గొండ, నిజామాబాద్, వరంగల్లు జిల్లాలలో సివిల్ ప్రొసీజరు కోడు, క్రిమినల్ ప్రొసీజరు కోడుల అవసరాల నిమిత్తం, ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఆధీనంలో గల తాబేదారీ కోర్టులలో ఒక కోర్టు భాషగాను.

2. ఏదైనా ఒక ఉద్యోగంలో ప్రమోషను పొందటానికి తెలుగులో, పరీక్ష అదనపు అర్హతగా వున్న సందర్భంలో, అట్లా తెలుగు పరీక్షలలో ఉత్తీర్ణుడు కాని ఉర్దూ తెలిసిన ఉద్యోగిని ప్రమోషను కొరకు ఆలోచించవచ్చును. అయితే అతడు యితర విధాల అర్హుడై వుండి నిర్దిష్ట వ్యవధిలోగా తెలుగు పరీక్షలో ఉత్తీర్ణుడు కావలసి వుంటుంది.

3. ఒక ప్రాంతంలో కనీసం 15 శాతం జనాభా ఒక భాషను మాట్లాడుతున్న కారణంగా, ఈ ప్రకటనకు జతనరచిన అనుసూచిలోని 4వ గడిలో సూచించిన భాషను దానికెదురుగా సదరు అనుసూచిలో 3 (అ), 3 (ఇ) గడులలో సూచించిన ప్రాంతాలలో తెలుగు భాషకు అదనంగా ఈ క్రింది పాలనా అవసరాలకు వాడవలసి వుంటుంది:—

(క) రోడ్లు, భవనాల శాఖలోని భవన విభాగపు సెక్షన్ ఆఫీసర్ల కార్యాలయాలలో అన్ని పనులకు సంబంధించిన టెండరు నోటీసులు, వేలం నోటీసులు, చిట్ టెండరు నోటీసులు జారీ చేసే నిమిత్తం;

(చ) అబ్కారీ సర్కిలు ఇన్‌స్పెక్టర్లు, సబ్ ఇన్‌స్పెక్టర్ల కార్యాలయాలలో వేలం నోటీసుల జారీ నిమిత్తం;

(ట) మత్స్య శాఖ ఇన్‌స్పెక్టర్ల కార్యాలయంలోను, యింకా దిగువ కార్యాలయాలలోను వేలం నోటీసులు, ప్రజలకు ఆసక్తి వున్న సాధారణ ఉత్తర్వులు జారీ నిమిత్తం;

(త) మండల స్థాయిలోను, యింకా దిగువ స్థాయిలోను, అటవీ శాఖకు చెందిన రేంజి ఆఫీసర్ల కార్యాలయాలలో అమ్మకపు నోటీసుల జారీ నిమిత్తం;

(ప) గ్రామ పంచాయితీలు, మండల ప్రజా పరిషత్తులు, జిల్లా ప్రజా పరిషత్తులు కార్యాలయాలలో టెండరు నోటీసుల జారీ నిమిత్తం;

(గ) సాగు నీటి శాఖ సెక్షన్ ఆఫీసర్ల కార్యాలయాలలో టెండరు, వేలం నోటీసులు, 10 వేల రూపాయలు అంతకు లోపు విలువగల చిల్లర పనులకు, చిట్ టెండరు నోటీసుల జారీ నిమిత్తం;

(జ) రెవిన్యూ శాఖకు చెందిన మండల రెవిన్యూ కార్యాలయాలలో, తదితర కార్యాలయాలలో – ఏదైనా ప్రతిపాదనకు ప్రజల నుంచి అభ్యంతరాలను కోరే నోటీసులను గ్రామాలలో ప్రకటించే నిమిత్తం, టెండరు నోటీసుల జారీ నిమిత్తం;

(డ) ముఖ్యమైన చట్టాల, నియమాలు, నిబంధనలు, నోటిఫికేషన్ల జారీ నిమిత్తం;

(ద) కార్యాలయాల సైను బోర్డులలోను, కార్యాలయ లేఖా పత్రాలలోను వాడే నిమిత్తం.

(ఆంధ్రప్రదేశ్ గవర్నరు గారి పేరున వారి ఉత్తర్వుల మేరకు)

**శ్రావణ్ కుమార్,**
ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి.



# అ ను సూ చి

|·ఓ·ఎం·ఎస్·నెం· 371 : 28–6–1988·

| వరుస సంఖ్య | జిల్లా పేరు | ప్రాంతం పేరు | | భాష పేరు |
|---|---|---|---|---|
| | | మునిసిపల్ ప్రాంతం పేరు· | మునిసిపల్ పరిధి క్రిందకు రాని తాలూకా ప్రాంతం పేరు | |
| (1) | (2) | (3–అ | (3–ఇ) | (4) |
| 1· | శ్రీకాకుళం | | *ఇచ్ఛాపురం | ఒరియా |
| | | | *సోంపేట | ఒరియా |
| 2· | గుంటూరు | గుంటూరు | | ఉర్దూ |
| | | చిలకలూరిపేట | | ఉర్దూ |
| | | నరసరావుపేట | | ఉర్దూ |
| | | పొన్నూరు | | ఉర్దూ |
| 3· | చిత్తూరు | | *నగరి | తమిళం |
| | | చిత్తూరు | చిత్తూరు | తమిళం |
| | | | *కుప్పం | తమిళం |
| | | | *పుత్తూరు | తమిళం |
| | | | *సత్యవేడు | తమిళం |
| | | | *బంగారుపాలెం | తమిళం |
| | | మదనపల్లి | | ఉర్దూ |
| | | | *వాయల్పాడు | ఉర్దూ |
| 4· | కడప | కడప | | ఉర్దూ |
| | | ప్రొద్దుటూరు | | ఉర్దూ |
| | | | *రాయచోటి | ఉర్దూ |
| | | | *లక్కిరెడ్డిపల్లి | ఉర్దూ |

| (1) | (2) | (3—అ) | (3—ఇ) | (4) |
|---|---|---|---|---|
| | | కాగజ్‌నగర్ | | ఉర్దూ |
| | | నిర్మల్ | | ఉర్దూ |
| | | | *మధోల్ | ఉర్దూ/ మరాఠి |
| | | | *వాంకాడి | మరాఠి |
| | | | *బోథ్ | మరాఠి |
| | | | సిర్పూర్ | మరాఠి |
| | | | *ఉట్నూర్ | మరాఠి |
| 18· | నల్గొండ | భువనగిరి | | ఉర్దూ |
| | | నల్గొండ | | ఉగా |

(*తాలూకా ముఖ్య పట్టణముతో కలుపుకొని మొత్తము తాలూకా)



# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

## సంక్షిప్తి

అధికార భాష – తెలుగు – 1966వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం – చట్టంలో విభాగాలు 3(1), 4 అనుసరించి

ప్రధాన పరిపాలన (అధికార భాష – 1) శాఖ

జి.ఓ.ఎం.ఎస్.నెం. 587 తేదీ: 28–10–1988

పరిగణన పత్రాలు:

1. ప్రధాన పరిపాలనా (అభా.3) శాఖ మెమో నెం.167/అభా.3/88–1, తేదీ 19–3–88.
2. ప్రధాన పరిపాలన (అభా.1) శాఖ జి.ఓ.ఎం.ఎస్.నెం.371, తేదీ 28–6–1988.
3. ప్రధాన కార్యదర్శి డి.ఓ.లేఖ నెం. 472/అభా.2/88–2, ప్రధాన పరిపాలన (అభా.2) శాఖ తేదీ: 5–9–1988.

* * *

ఉ త్త ర్వు :

వచ్చే ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవం నవంబరు 1, 1988 నుంచి రాష్ట్ర పరిపాలనలో అన్ని స్థాయిలలోను జరిపే ఉత్తర ప్రత్యుత్తరాలు, అన్ని ప్రభుత్వ ఉత్తర్వులు తెలుగులోనే వుండాలని, ఇంగ్లీషు వాడకాన్ని భారత ప్రభుత్వంతోను యితర ప్రభుత్వాలతోను జరిపే ఉత్తర ప్రత్యుత్తరాలకు పరిమితం చేయాలని పై 3వ నిర్దేశంలో ప్రభుత్వం ఆదేశాలు యిచ్చింది.

ఆంధ్రప్రదేశ్ గెజిటు అసాధారణ సంచికలో ఈ దిగువ చెప్పిన నోటిఫికేషను ప్రచురిస్తారు:

# నో టి ఫి కే ష ను

"ఆంధ్రప్రదేశ్ అధికార భాషా చట్టం, 1966 (1966 సంవత్సరపు 9వ చట్టం) లోని 4వ విభాగంతో బాటు 3వ విభాగంలోని (1)వ ఉప విభాగం ద్వారా లభించిన అధికారాలను పురస్కరించుకుని, ఆంధ్రప్రదేశ్ గవర్నరు గారు, 1988 నవంబరు 1వ తేది నుంచి ఆ తరువాత రాష్ట్రంలో ప్రభుత్వ ఉత్తరప్రత్యుత్తరాలకు, అన్ని ప్రభుత్వ ఉత్తర్వుల జారీకి తెలుగు భాషను వాడాలని, ఇంగ్లీషు భాషను వాడరాదని యిందుమూలంగా ఆదేశిస్తున్నారు. ఐతే చట్టంలోని 7వ విభాగం ద్వారా నిర్దేశించిన అవసరాలకు ఉర్దూ, తమిళం, కన్నడం, ఒరియా, మరాఠీ భాషల ఉపయోగానికి యిది భంగకరం కాదు. ఇక భారత ప్రభుత్వంతో, యితర ప్రభుత్వాలతో, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం వెలుపలగల తెలుగేతర చిరునామాదార్లతో జరిపే ఉత్తరప్రత్యుత్తరాలకు ఇంగ్లీషు వాడకం పరిమితం అవుతుంది".

(ఆంధ్రప్రదేశ్ గవర్నరు గారి పేరున వారి ఉత్తర్వుల మేరకు)

**జి. ఆర్. నాయర్,**
ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి.